# 1. శ్రీకాకుళం జిల్లా

1. వైశాల్యం : 5837 కి.మీ.
2. జనాభా : 29,38,000
3. అక్షరాస్యత : 42 శాతం
4. మండలాలు : 37 (పంచాయితీలు 853)
5. నదులు : వంశధార, నాగావళి, బహుదా, మహేంద్రతనయ
6. అడవులు : 10%
7. పంటలు : జీడిమామిడి, వేరుశెనగ, గోగునార, చోళ్లు (రాగులు)
8. ఖనిజాలు : మాంగనీసు, సున్నపురాయి, గ్రానైటు
9. పరిశ్రమలు : జనపనార, జీడిపప్పు, చక్కెర.

10. శ్రీకాకుళం నుండి ఈ జిల్లాలోని వివిధ ప్రాంతాలకు గల సుమారు దూరం : (కి.మీ.లలో) పాలకొండ : 48, రాజాం (వయా సంకిలి) : 72, రాజాం (వయా పొందూరు) : 45, నరసన్నపేట : 28, వీరఘట్టం : 90, టెక్కలి : 55, పలాస (కాశీబుగ్గ) : 90, సోంపేట : 125, ఇచ్ఛాపురం : 150, శ్రీకూర్మం : 18, అరసవెల్లి : 3, శ్రీముఖలింగం : 50 కి.మీ.

11. సరిహద్దులు : తూర్పు – బంగాళాఖాతం
దక్షిణం – విజయనగరం జిల్లా
ఉత్తరం – ఒరిస్సా జిల్లా
పడమర – విజయనగరం

12. ముఖ్య కేంద్రం : శ్రీకాకుళం పట్టణం
13. రైల్వేస్టేషన్ : శ్రీకాకుళం రోడ్ (ఆముదాలవలస)
14. ప్రధానపట్టణాలు: శ్రీకాకుళం, ఆముదాలవలస, పాలకొండ, టెక్కలి, నర్సన్నపేట, కాశిబుగ్గ, సోంపేట, పలాస, రాజాం, మందస

15. మండలాలు(37) :1. ఇచ్ఛాపురం 2. కవిటి 3. కంచిలి 4. సోంపేట 5. మందస 6. పలాస 7. వజ్రపు కొత్తూరు 8. నందిగాం 9. టెక్కలి 10. సంత బొమ్మాళి 11. కోటబొమ్మాళి 12. జాలుమూరు 13. సావరకోట 14. పాతపట్నం 15. మెల్లాపుట్టి 16. హీరమండలం 17. కొత్తూరు 18. దామిని 19. సీతంపేట 20. వీరఘట్టం 21. భూర్జ 22. పాలకొండ 23. వంగర 24. రేగడి ఆముదాలవలస 25. సంతకవిటి 26. రాజాం 27. నరసన్నపేట 28. పోటాకి 29. శ్రీకాకుళం 30. గార 31. ఆముదాలవలస 32. సరుబుజ్జిడి 33. ఎచ్చెర్ల 34. గంగువారి సిగడమ్ 35. పొందూరు 36. రణస్థలం 37. లావేరు.



16. జిల్లా చరిత్ర :కళింగ సామ్రాజ్యంలో భాగమైన శ్రీకాకుళం జిల్లా ఒరిస్సా రాష్ట్రానికి అనుకొని ఉంది. నందులు, మౌర్యుల పాలనలో క్రీస్తుపూర్వం 467 నుండి 366 వరకూ ఉన్న ఈ ప్రాంతం తరువాత కాలంలో శాతవాహనుల ఏలుబడిలో సాగింది. విష్ణుకుండినులు, కళింగ సామ్రాజ్యల్లో భాగంగా కూడా ఉన్న ఈప్రాంతం గజపతులు, విజయనగర రాజుల ఆధీనంలోకి వచ్చింది. క్రీ.శ. 1565 లో తళ్లికోట యుద్ధం తరువాత గోల్కొండ రాజుల పాలన ఐదు దశాబ్దాల పాటు సాగింది. 1753లో సలబత్‌సింగ్ నుంచి ఈ ప్రాంతాన్ని ఫ్రెంచ్‌వారు స్వాధీనం చేసుకొన్నారు. 1930లో ఒరిస్సా రాష్ట్రం ఏర్పడినప్పుడు పాత శ్రీకాకుళం, టెక్కలి, సోంపేట, తాలూకాలు, పర్లాకిమిడి, ఇచ్ఛాపురం, బరంపురం, ఇంకా కొన్ని ప్రాంతాలను అప్పటి మద్రాసు ప్రెసిడెన్సీలో విలీనం చేశారు. 1950 విశాఖపట్టణం లోని కొన్ని ప్రాంతాలలో పూర్తి స్థాయిలో శ్రీకాకుళం జిల్లా ఏర్పడింది.

## శ్రీకాకుళం జిల్లాలోని దర్శనీయ స్థలాలు

**1.హర్షవల్లి :** శ్రీసూర్యనారాయణస్వామి దేవాలయము. శ్రీకాకుళమునకు 2 కి.మీ. దూరములో వున్నది. ఏకైక సూర్యదేవాలయము. ఇచ్చట సూర్యుడు ఇంద్ర ప్రతిష్ఠ. ఈ క్షేత్రము దర్శనముతోనే సర్వగ్రహారిష్ఠ శాంతి లభిస్తుంది.

**2.శ్రీకూర్మం :** శ్రీ మహావిష్ణు అవతారమైన కూర్మరూపములో వెలసిన శ్రీ కూర్మనాథ దేవాలయము శ్రీకాకుళమునకు 15 కి.మీ. దూరములో వున్నది. మరియు కర్పూరేశ్వర స్వామి మరియు కూటేశ్వరస్వామి దేవాలయము దర్శించగలరు. మరియు పాతాళ సిద్ధేశ్వరాలయము దర్శించగలరు.

**3.శ్రీముఖలింగం :** శ్రీముఖ లింగేశ్వరాలయం మరియు మధుకేశ్వర దేవాలయము, భీమేశ్వర దేవాలయము శ్రీకాకుళమునకు 58. కి.మీ. దూరములో వున్నది. స్వామిని "శ్రీ గంగా విశ్వేశ్వర త్రికళింగ దేవ మధుకేశ్వర స్వయం భూలింగమూర్తి" అని అంటారు.

**4.రావివలస :** శ్రీ ఎండల మల్లికార్జున దేవాలయము ప్రసిద్ధి. టెక్కలికి 6 కి.మీ. దూరములో వున్నది. శివలింగం చాలా పెద్దది కావడం వల్ల గోపురం ఉండదు.

**5.మందస :** శ్రీ వరాహస్వామి దేవాలయము. సోంపేటకు 26 కి.మీ. దూరములో వున్నది. ఇది చాలా ప్రాచీన ఆలయం. పాండవులు ఇక్కడనే అజ్ఞాతవాసం చేశారు.

**6.సంగాం :** పంచలింగాలలో ఒకటిగా ప్రసిద్ధిచెందిన సంగమేశ్వర దేవాలయం వున్నది. శ్రీకాకుళమునకు 56 కి.మీ. దూరములో వున్నది.

**7.బారువా :** శ్రీ కోటిలింగేశ్వర ఆలయం, జనార్ధనస్వామి ఆలయం, శ్రీకాకుళమునకు 65 కి.మీ. దూరములో కలదు. పురాతన ఓడరేవు ప్రాంతము.

**8.మహేంద్రగిరి :** ఎత్తైన పర్వతము. 1600 ఎత్తు వుంటుంది. పరశురాముడు తపస్సు చేసిన స్థలం. ఇచ్చట కోటిలింగేశ్వర, జగన్నాథ, వేణుగోపాలస్వామి ఆలయములు వున్నాయి.

**9.శ్రీకాకుళం :** ఉమారుద్ర కోటేశ్వర ఆలయము. నాగావళి ఒడ్డున వున్నది. ఇది చాలా ప్రాచీన ఆలయం.

**10.బొబ్బిలి :** బొబ్బిలిలోని శ్రీ వేణుగోపాలస్వామి ఆలయం ప్రతి ఒక్కరు చూడగలరు.

**11.సంగపురం :** ఇచ్చట గల హటకేశ్వరస్వామి ఆలయం దర్శించగలరు.

**12.శాలిహుండం :** వంశధారానది ఒడ్డున శాలి హుండంలో మహాస్థూపం ఉన్నది. శ్రీకాకుళానికి 18 కి.మీ దూరంలో ఈ గ్రామంలో బౌద్ధారామాలు, స్థూపాలు ఉన్నాయి.

**13.నరసన్నపేట :** ఇచ్చట వేంకటేశ్వర స్వామి దేవాలయము మరియు జగన్నాథస్వామి దేవాలయము ఒకే ఆవరణలో ఉన్నవి. శ్రీకాకుళం నుండి మందసా వెళ్ళే మార్గములో ఉన్నది.

**14.పాలకొండ :** ఇచ్చట గల జగన్నాథ స్వామి ఆలయము చూడదగినది. శ్రీకాకుళమునకు 38 కి.మీ. దూరములో వున్న ఈ పాలకొండలో కోట దుర్గమ్మ ఆలయం చూడదగినది. కోట దుర్గమ్మ ఆలయము కూడ చూడదగినది. శ్రీకాకుళం

**15.పాండవుల పంచ :** వంగర మండలం మద్దువలస సమీపములో పాండవుల పంచలో అరణ్య వాస సమయములో పాండవుల వసతి చేశారని అంటారు.

**16.సోమేశ్వరాలయం :** శ్రీముఖ లింగం క్షేత్రంలో పశ్చిమాభి ముఖముగా సోమేశ్వర ఆలయం చూడదగినది. ఇది చాలా ప్రాచీన ఆలయం.

**17.భీమేశ్వరాలయం :** ఈ దేవాలయంలో కోటికి ఒకటి తక్కువగా శివలింగాలు ఉన్నట్టుగా సెలవిస్తారు. ఇది చాలా ప్రాచీన ఆలయం (శ్రీముఖలింగం)

**18.మధుకేశ్వరాలయం :** ఈ ఆలయం చాలా పెద్దది. విప్ప చెట్టు నుండి శివలింగము ఉద్భవించినదిగా భావిస్తుంటారు. (శ్రీముఖలింగం)

**20.మెళియాపుట్టి :** మహేంద్రగిరి వద్ద మెళియాపుట్టి గ్రామంలో వేణుగోపాలస్వామి ఆలయం చూడదగినది.

**21.రాజాం :** పాలకొండ తాలూకాలోని విఘ్నేశ్వరస్వామి దేవాలయం తప్పక దర్శించగలరు. మరియు మల్లిఖార్జునస్వామి ఆలయం చూడదగినది.

**22.అడ్డశీల :** పార్వతీపురం తాలూకాలోని అడ్డశీలలో కాశీ విశ్వేశ్వరస్వామి దేవాలయము దర్శించగలరు.

**23.దేవుని గుండ :** కామాండకు దగ్గరలోని రామలింగేశ్వరస్వామి దేవాలయం దర్శించగలరు.

**24.విప్పుల :** విప్పులలో సుందరేశ్వర స్వామి దేవాలయం దర్శించగలరు.





**25.మోసుబందరు :** మోసుబందరులో మణి నాగేశ్వరస్వామి దేవాలయం చూడగలరు.

**26. పోందూరు :** శ్రీకాకుళానికి 21 కి.మీ దూరములో ఖాదీ వస్త్రాలకు చాలా ప్రసిద్ధి. ఎర్రని పత్తితో వస్త్రాలు నేస్తారు.

**27. తేలినీలాపురం :** శ్రీకాకుళానికి 65 కి.మీ దూరము. ఇచ్చట పక్షి సంరక్షణ కేంద్రము వున్నది. రష్యా నుండి కొంగలు వస్తాయి.

**28. కవిటి :** శ్రీకాకుళానికి 130 కి.మీ దూరములో ఇచ్ఛాపురం, సోంపేట, మధ్యగల సముద్ర తీర ప్రాంతం. చింతామణి అమ్మవారు.

**29. కళింగపట్నం :** శ్రీకాకుళానికి 25 కి.మీ.దూరములో తుఫాను హెచ్చరికల కేంద్రం పురాతన లైట్‌హౌస్ వున్నది. వంశధారనది సంగమ స్థానం.

## ౨. విజయనగరం జిల్లా

**1. వైశాల్యం** : 6,539 చ.కి.మీ.
**2. జనాభా** : 26,00,000
**3. అక్షరాస్యత** : 38%
**4. మండలాలు** : 34 (పంచాయితీలు 1461)
**5. నదులు** : గోముఖి, గోస్తనీ, లాంగుల్య, సువర్ణముఖి, కొన్ని చిన్నాపెద్దగెడ్డలు.
**6. అడవులు** : 15%
**7. పంటలు** : వేరుశెనగ, వరి, రాగులు (చోళ్లు)
**8. ఖనిజాలు** : క్వార్ట్జ్, మాంగనీస్, సున్నపరాయి, గ్రానైటు
**9. పరిశ్రమలు** : సింమెటు, టైర్లు, తోళ్ళు, జనపనార,
**10. విజయనగరం నుండి ఈ జిల్లాలోని వివిధ ప్రాంతాలకు గల దూరం (సుమారుగా కి.మీ.లలో) :**

| పట్టణం/నగరం | దూరం | పట్టణం/నగరం | దూరం |
|---|---|---|---|
| గజపతి నగరం | 22 | సాలూరు | 56 |
| శృంగవరపుకోట | 45 | పార్వతీపురం | 88 |
| రామభద్రపురం | 47 | బొబ్బిలి | 62 |

**11. సరిహద్దులు** : తూర్పు - బంగాళఖాతం
పశ్చిమ - విశాఖజిల్లా
ఉత్తరం - ఒరిస్సా రాష్ట్రం
దక్షిణం - శ్రీకాకుళం జిల్లా
**12. ముఖ్యకేంద్రం** : విజయనగరం పట్టణం
**13. రైల్వేస్టేషన్** : విజయనగరం జంక్షన్

**14.ప్రధాన పట్టణాలు :** విజయనగరం, పార్వతీపురం, సాలూరు, బొబ్బిలి, చీపురుపల్లి, కొండపాలెం, (శ్రీరామ నగరం) నెల్లిమర్ల.

**15.మండలాలు(34) :** 1. విజయనగరం 2. గంట్యాడ 3. భోగాపురం 4. డెంకాడ 5. పూసపాటిరేగ 6. శృంగవరపుకోట 7. జామి 8. కొత్తవలస 9. వేపాడ 10. లక్కవరపుకోట 11. నెల్లిమర్ల 12. గుర్ల 13. చీపురుపల్లి 14. గరివిడి 15. మెరకముడిదాము 16. గజపతి నగరం 17. బొండపల్లి 18. దత్తి రాజేరు 19. మెంటాడ 20. పార్వతీపురం 21. కొమరాడ 22. గరుగుబిల్లి 23. జి.ఎమ్.వలస 24. కురుపాం 25. గుమ్మలక్ష్మీపురం 26. బాడంగి 27. తెర్లాం 28. సాలూరు 29. పాచిపెంట 30. మక్కువ 31. రామభద్రపురం 32. బొబ్బిలి 33. సీతానగరం 34. బలిజిపేట.

**16. జిల్లా చరిత్ర :** బొబ్బిలి యుద్ధరంగానికి కేంద్రమైన విజయనగరం జిల్లా ఒకప్పుడు కళింగ సామ్రాజ్యంలో భాగంగా ఉండి ఆ తరువాత చోళ రాజుల పాలన కిందకు వచ్చింది. రెండు శతాబ్దాల పాటు విజయనగర సామ్రాజ్య రాజధానిగా విలసిల్లిన ఈ ప్రాంతం 1757లో జరిగిన బొబ్బిలి యుద్ధంతో చరిత్రలో నిలచిపోయింది. ఫ్రెంచ్ జనరల్ బుస్సీ మద్దతుతో విజయనగర రాజు రామరాజు బొబ్బిలి ప్రభువు రంగారావుతో యుద్ధానికి తలపడి సర్వనాశనం కొనితెచ్చుకున్నాడు. విజయం అసాధ్యమని తెలిపోవడంతో రంగారావు మహిళలు, పిల్లలతో సహా అందరినీ చంపి తాను చనిపోతాడు. రంగారావు అనుచరులు ఆ తరువాత రామరాజును చంపి ప్రతీకారం తీర్చుకున్నారు. ఈ ప్రాంతంలోనే 1758లో బ్రిటిష్, ఫ్రెంచ్‌వారి సేనల మధ్య జరిగిన మరో ప్రతిష్ఠాత్మక యుద్ధం చందుర్తి యుద్ధంతో బ్రిటిష్ అధిపత్యం ప్రారంభమైనది. జిల్లాల పునర్విభజనలో భాగంగా విశాఖ, శ్రీకాకుళం జిల్లాల్లోని కొన్ని ప్రాంతాలను కలుపుకొని 1979 జూన్ ఒకటిన విజయనగరం జిల్లాను ఏర్పాటు చేశారు.

## విజయనగరం జిల్లాలోని దర్శనీయ స్థలాలు

**1.రామతీర్థాలు :**గొప్పపుణ్యక్షేత్రం విజయనగరానికి 15 కి.మీ. దూరంలో వున్నది. (జైనక్షేత్రం) మరియు ఇచ్చటగల కోదండరామ స్వామి దేవాలయం దర్శించగలరు.

**2.తోటపల్లి :**ఇచ్చట గల శ్రీ వేంకటేశ్వర ఆలయం దర్శించగలరు. నాగావళి నదీ తీరంలో ఉన్నది.

**3.పుణ్యగిరి :** ధారాగంగమ్మ ఈశ్వరాలయము వున్నది. శృంగవరపు కోటకు 3 కి.మీ. దూరంలో వుంది. పర్వత పంక్తి మీద వున్నది. కోటిలింగాలు, గోడుగాలధార్ అనే రెండు స్నానఘట్టాలు వున్నయి.



**4.కుమిలి :** అనేక దేవాలయాలు, చిత్ర శిల్పాలతో అలరారు తుంటుంది. రెల్లివలసకు 2 కి.మీ. దూరంలో వున్నది.తొమ్మిది దేవుళ్ళ విగ్రహాలు కలవు.

**5.బొబ్బిలి :** విజయనగరంనకు 60 కి.మీ. దూరంలో వుంది. ఇదే తెలుగు వీరుల శౌర్య ప్రతాప గాధలకు పుట్టినిల్లు. ఇచ్చట చక్కని వేణుగోపాలస్వామి ఆలయం కలదు. చంపానదీ తీరాన గజపతి నగరములో ఈశ్వరాలయము కలదు.

**6.విజయనగరం :** పైడితల్లి అమ్మవారి దేవాలయము, బాబా మెట్ట దర్శించదగినవి. పైడితల్లి అమ్మవారి దేవాలయంలో ప్రతి సంవత్సరం విజయదశమి తర్వాత వచ్చే మొదటి మంగళవారం సిరిమామ ఉత్సవం చూడదగినది. మహారాజావారి కోట, కోటలోని రాజగృహాలు చూడదగినవి. శిధిలమైన కోట రంగారావు చావడీ చూడదగినది.

**7.నారాయణపురం :** బలిజిపేట మండలంలోని నారాయణపురంలో నీలకంఠేశ్వర స్వామి దేవాలయం చూడదగినది.

**8.భీముని పట్నం :** ఇచ్చట గల కుంతీమాధవస్వామివారి దేవాలయం దర్శించగలరు మరియు లక్ష్మీనరసింహస్వామి దేవాలయం దర్శించగలరు. కొండ దిగువన మాధవస్వామి, కొండ ఎగువన పద్మనాభస్వామిని దర్శించగలరు.

**9.గోవిందాపురం :** భగవద్గీతసారం ఆధారముగా నిర్మించిన ఆలయం కలదు.

**10.జామి :** గౌతమీనదీ తీరములో ప్రాచీన ఆలయములు వున్నవి. మాధవస్వామి, వేణుగోపాలస్వామి ఆలయములు కలవు.

**11.గజపతి నగరం :** బొబ్బిలి దిగువన చంపానదీ తీరములో గజపతి నగరములో శివాలయము కలదు. ఆవరణలో రామలింగేశ్వరాలయము, కన్యకాపరమేశ్వరీ ఆలయము, రామాలయము కలవు. దగ్గరలోనే వేంకటేశ్వ రాలయము కలదు.

**12.తాటిపూడి :** శృగంవరపు కోట నుండి 8 కి.మీా. దూరములో రెండు కొండల మధ్య జలాశయము వున్నది.

**13. బోర్రాగుహలు :** విశాఖ నుండి 88 కి.మీా. దూరములో శృంగవరపు కోటకు 43 కి.మీా. దూరములో అనంతగిరి కొండలలో స్టాలమైట్ ఖనిజములతో ఏర్పడినవి బోర్రాగుహలు. ఇందులో శివలింగం కలదు. కామధేనువు విగ్రహం పొదుగు నుండే గోస్తనీనది పుట్టింది. ఈ గుహలు 10 లక్షలు క్రితం ఏర్పడినవి.



# 3. విశాఖపట్నం జిల్లా

1. వైశాల్యం : 11,161 చ.కి.మీ.
2. జనాభా : 38,50,000
3. అక్షరాస్యత : 50%
4. మండలాలు : 42 (పంచాయితీలు)
5. నదులు : శారద, తాండవ, వారాహి, గోస్తని, చంపావతి, తదితర చిన్నా పెద్ద గెడ్డలు.
6. అడవులు : 48%
7. పంటలు : వరి, జొన్న, చెఱకు, రాగులు, వేరుశెనగ, నువ్వులు
8. ఖనిజాలు : గ్రానైటు, హెపటైట్, మాగ్నటైట్, బాక్సయిట్, మైకా
9. పరిశ్రమలు : స్టీలు (ఉక్కు), పడవల తయారీ, సిమెంట్, ఎరువుల వంటి దాదాపు 60 భారీపరిశ్రమలతో పాటు 120 చిన్నతరహా పరిశ్రమలు.

10. విశాఖపట్టణం నుండి ఈ జిల్లాలోని వివిధ ప్రాంతాలకు గల దూరం (సుమారుగా కి.మీ.లలో) :

| పట్టణం/నగరం | దూరం | పట్టణం/నగరం | దూరం |
|---|---|---|---|
| భీమిలి | 30 | నర్సీపట్నం | 70 |
| అనకాపల్లి | 43 | యలమంచిలి | 60 |
| చోడవరం | 60 | సింహాచలం | 16 |

11. సరిహద్దులు : తూర్పు - బంగాళఖాతం
పశ్చిమ - ఒరిస్సా రాష్ట్రం
ఉత్తరం - విజయనగరం జిల్లా
దక్షిణం - తూర్పు గోదావరి జిల్లా
12. ముఖ్యకేంద్రం : విశాఖపట్టణం (వైజాగ్)
13. రైల్వేస్టేషన్ : వాల్తేరు జంక్షన్ (వైజాగ్)

**14.ప్రధాన పట్టణాలు:** విశాఖపట్నం, భీమునిపట్నం, అనకాపల్లి, నర్సీపట్నం, చోడవరం, యలమంచిలి.

**15.మండలాలు(42) :** 1. చింతపల్లి 2. కొయ్యూరు 3. గూడెం కొత్తవీధి 4. పాడేరు 5. గంగరాజు మాడుగుల 6. ముచింగిపుట్టు 7. పెదబాయలు 8. హుకుంపేట 9. అరకులోయ 10. అనంతగిరి 11. దంబరీగూడ 12. చోడవరం 13. రావికమతం 14. బుచ్చయపేట 15. చీడికాడ 16. మాడుగుల 17. నర్సీపట్నం 18. గోలుగొండ 19. రోలుగుంట 20. కోటవురట్ల 21. మేకవారిపాలెం 22. నాతవరం 23. నక్కపల్లి 24. పాయకరావుపేట 25. యలమంచిలి 26. యస్.రాయవరం 27. అచ్యుతాపురం



28. రాంబిల్లి 29. అనకాపల్లి 30. మునగపాక 31. కశింకోట 32. కె. కోటపాడు 33. దేవరపల్లి 34. సబ్బవరం 35. పరవాడ 36. విశాఖపట్నం 37. పెందుర్తి 38. గాజువాక 39. పెరగంట్యాడ 40. భీమునిపట్నం 41. పద్మనాభం 42. ఆనందపురం

**16.జిల్లా చరిత్ర :** బ్రిటిష్ పాలనా కాలంలో దేశంలోనే అతి పెద్ద జిల్లాగా ఉన్న విశాఖపట్టణం నేటికి పారిశ్రామికంగా గణనీయమైన పురోభివృద్ధి సాధించి ఆసియాలో కెల్లా అత్యంత వేగంగా అభివృద్ధి చెందుతున్న ప్రాంతంగా పేరు సాధించింది. నందులు, మౌర్యుల పాలన కాలంలో వారి ఏలుబడి కింది ఉన్న ఈ ప్రాంతం బౌద్ధ, జైన విహారాలకు పేరుగాంచింది. తూర్పు చాళుక్యులు భీమిలి రేవును 1879లో యలమంచిలి వద్ద కట్టారు. 1879లో వీరయ్యదొర ఆధ్వర్యంలో రంప తిరుగుబాటు, 1922లో సవర ఆటవీ ప్రజల తిరుగుబాటు జరిగింది. మన్యం విప్లవవీరుడు అల్లూరి సీతారామరాజు గిరిజనుల సహకారంతో రంపచోడవరం, అడ్డతీగెల, నర్సీపట్నం ప్రాంతాల్లో సాయుధ తిరుగుబాటు జరిపి చివరకు బ్రిటిష్ వారి చేతిలో మరణించాడు. స్వాతంత్ర్యం వచ్చిన తరువాత విశాఖజిల్లా రెండు సార్లు విభజనకు గురైంది. 1950లో కొన్ని ప్రాంతాలను తీసుకొని శ్రీకాకుళం జిల్లాను ఏర్పాటుచేస్తే మళ్ళీ 1979లో ఈ రెండు జిల్లాలను మూడుగా విభజించి విజయనగరం జిల్లాను రూపొందించారు.

## విశాఖ నగరములోని ఆలయములు

| | | |
|---|---|---|
| 1. | సంపదలనిచ్చే సంపత్ వినాయకర్ ఆలయం | వాల్తేరు అప్ల్యాండ్ |
| 2. | సంపదలనిచ్చే విజయ గణపతి ఆలయం | శంకరమఠం |
| 3. | సంపదలనిచ్చే దుర్గా గణపతి | సీతమ్మపేట జంక్షన్ |
| 4. | సంపదలనిచ్చే సిద్ధి గణపతి | యల్.బి. కాలనీ |
| 5. | షిర్డిసాయిబాబా ఆలయము | డాక్టర్స్ కాలనీ |
| 6. | షిర్డిసాయిబాబా ఆలయము | ఈస్ట్ పాయింట్ కాలనీ |
| 7. | షిర్డిసాయిబాబా ఆలయము | కంచరపాలెం |
| 8. | షిర్డిసాయిబాబా ఆలయము | రైల్వే న్యూకాలనీ |
| 9. | షిర్డిసాయిబాబా ఆలయము | అక్కయ్యపాలెం |
| 10. | షిర్డిసాయిబాబా ఆలయము | బైరాగ్‌మఠం వన్-టౌన్ |
| 11. | షిర్డిసాయిబాబా ఆలయము | బురుజుపేట |
| 12. | షిర్డిసాయిబాబా ఆలయము | అడవివరం |
| 13. | షిర్డిసాయిబాబా ఆలయము | కైలాసపురం |
| 14. | వరాహా నరసింహస్వామి ఆలయము | సింహాచలం |
| 15. | శ్రీ కనక మహాలక్ష్మి అమ్మవారి ఆలయము | బురుజుపేట |
| 16. | భావనా ఋషి ఈశ్వర ఆలయము | బురుజుపేట |
| 17. | శ్రీ సాగరదుర్గ అమ్మవారి ఆలయము | హార్బర్‌పేట |

| | | |
|---|---|---|
| 18. | అమ్మవారి ఆలయము (శ్రీ చక్రం) | దేవీపురం |
| 19. | కాళీ ఆలయము | దేవీపురం |
| 20. | కరకచెట్టు పోలమాంబ అమ్మవారి ఆలయము | పెదవాల్తేరు |
| 21. | ఎరుకుమాంబ అమ్మవారి ఆలయము | దొండపర్తి |
| 22. | తోట పోలమాంబ అమ్మవారి ఆలయము | గోపాలపట్నం |
| 23. | అయ్యప్ప స్వామి ఆలయము | షీలానగర్ |
| 24. | శ్రీ రామాలయం | కనకమహాలక్ష్మి ఆలయం దగ్గర |
| 25. | పోర్ట్ హార్బర్ + మసీదు + చర్చి | త్రిభుజాకారాములో ఉన్నవి. |
| 26. | వేంకటేశ్వరస్వామివారి ఆలయము | పోర్ట్‌హార్బర్ |
| 27. | వేంకటేశ్వరస్వామివారి ఆలయము | లాసన్స్ బే కాలనీ |
| 28. | శ్రీ భూసమేత విజయ వేంకటేశ్వరస్వామివారి ఆలయం | మద్రిపాలెం |
| 29. | శంకరమఠం | శ్రీ నగర్ |
| 30. | రామలింగేశ్వర ఆలయము | శాంతిపురం |
| 31. | ఉమా మహేశ్వర ఆలయము | మద్దిలపాలెం |
| 32. | యాసిన్ బాబాగుడి | కంచరపాలెం |
| 33. | తాజ్‌బాగ్ (తాజుద్దీన్ బాబాగారి ఆలయం) | అక్కయ్యపాలెం |
| 34. | శివాలయం | ఆర్.కె. బీచ్ |
| 35. | శివాలయం | యన్.ఎ.డి. కొత్తరోడ్ |
| 36. | శివాలయం | జగదాంబ జంక్షన్ |
| 37. | దుర్గాలమ్మ ఆలయం | పూర్ణామార్కెట్ |
| 38. | ఎల్లమ్మ అమ్మవారి ఆలయం | జగదాంబ జంక్షన్ |
| 39. | ప్రసన్నాంజనేయస్వామి ఆలయం | జగదాంబ జంక్షన్ |
| 40. | ప్రన్నాంజనేయస్వామి ఆలయం | పూర్ణా మార్కెట్ |
| 41. | లలిత అమ్మవారి ఆలయం | లలితానగర్ |
| 42. | శ్రీ త్రిమూర్తిక వేంకటేశ్వరస్వామి ఆలయం | సీతమ్మధార |
| 43. | కళ్యాణ వేంకటేశ్వరుడు | సీతమ్మధార |
| 44. | లలితా పీఠము | కైలాసపురం |
| 45. | శ్రీ రాఘవేంద్రస్వామి ఆలయం | రామ్‌నగర్ |
| 46. | శ్రీ ఉమా నీలకంఠేశ్వరస్వామి ఆలయం | ఈనాడు సెంటర్ |
| 47. | జగన్నాధస్వామి ఆలయం | పెదవాల్తేరు |
| 48. | హనుమాన్ మందిరం | తాటిచెట్టుపాలెం, యస్.హెచ్.యస్.రోడ్ |
| 49. | శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర స్వామి ఆలయం | ఊర్వశి జంక్షన్, యన్.హెచ్.యస్.రోడ్ |
| 50. | శ్రీ సాయిబాబా ఆలయం | అక్కయ్యపాలెం హైవే |





## విశాఖపట్నం జిల్లాలోని దర్శనీయ స్థలాలు

**1.సింహాచలం :** ప్రాచీనమైన ఈ దేవాలయమందు వరాహలక్ష్మి, వరాహస్వామి విగ్రహం చందనంతో కప్పబడి ఉండును. విశాఖపట్నానికి 16 కి.మీ. దూరంలో కొండమీద వున్నది. సముద్ర మట్టానికి 244 మీ ఎత్తులో వున్నది ఈ క్షేత్రం.

**2.అప్పికొండ :** సోమేశ్వరాలయం దర్శనీయక్షేత్రము విశాఖకి 35 కి.మీ. దూరంలో గలదు.

**3.పంచదార్ల :** శ్రీ ధర్మలింగేశ్వర ఆలయం ప్రసిద్ధి చెందింది. అనకాపల్లికి 24 కి.మీ. దూరంలో వున్నది. యలమంచిలికి 10 కి.మీ. దూరములో వున్నది. నిరంతరం 5 దార్ల ప్రవహించడం వల్లనే పంచదార్ల అని పేరు వచ్చినది.

**4.భీముని పట్నం :**ఇచ్చట గల ఉగ్రనరసింహస్వామి ఆలయం చూడగలరు. కాని నరసింహస్వామి శాంతిచిత్తులై లక్ష్మీనారాయణస్వామి దర్శనమిచ్చు చుండును.

**5.శంకారం :** అనేక బౌద్ధ స్థూపాలు గలవు. విశాఖ నుండి 41 కి.మీ. దూరంలో వున్నది. (బొజ్జకొండ)

**6.ఋషికొండ :** సప్త ఋషీశ్వర స్వామి ఆలయం వున్నది. శివాలయం, బీచ్‌లను దర్శించగలరు.

**7.అనకాపల్లి :** నూకాంబికా అమ్మవారు విశాఖ నుండి 35 కి.మీ. దూరంలో అనకాపల్లిలో గవరపాలెంలో వున్నది. ఆది, మంగళ, గురువారములలో ప్రత్యేక పూజలు జరుగును.

**8.రామకృష్ణాబీచ్ :** ఇచ్చట కాశీ దేవాలయము దర్శించదగినది.

**9.బలిఘట్టము :** ఇక్కడి లింగం స్ఫటికముగా వుంటుంది. బ్రహ్మప్రతిష్ఠించిన లింగము అగుటవలన బ్రహ్మలింగేశ్వర ఆలయము అని అంటారు.

**10. విశాఖనగరము :** బురుజుపేటలోని శక్తివంతమైన అమ్మవారి క్షేత్రము వుంది. అదే కనకమహాలక్ష్మి ఆలయం, మరియు సాగరమాత దేవాలయం చూడగలరు.

**11. అనకాపల్లి :**ఇక్కడ కొండపై శ్రీ వేంకటేశ్వరస్వామి దేవాలయము ఉన్నది. శ్రీ కన్యకా పరమేశ్వరీ దేవాలయము ప్రసిద్ధి చెందినది.

**12. బొర్రాగుహలు :**విశాఖకు 90 కి.మీ దూరములో అరకులోయ దారిలో ఈ బోర్రాగుహలు వున్నాయి. ప్రతి ఒక్కరు దర్శించదగినవి.

**13.అనంతగిరి :**అరకులోయకు వెళ్లేదారిలో అనంతగిరి కాఫీతోటలు కలవు.

**14.తోట్లకొండ :**విశాఖ నుండి 16 కి.మీ. భీమ్లి రోడ్డుపై తోట్లకొండ ప్రముఖబౌద్ధ క్షేత్రం కలదు.

**15. పావురాలకొండ :** విశాఖ నుండి 25 కి.మీ భీముని పట్నంకు దగ్గర వున్నది. పవిత్రస్థూపం వున్నది. (నరసింహస్వామి కొండ).

**16. కైలాసగిరిపార్కు :**304 మీటర్లు ఎత్తయిన కొండమీద వున్న కైలాసగిరి పార్కు చూసి తీరవలిసినదే! కొండ మీద నుండి నగరము, సముద్రము చాలా చక్కగా కనిపించును! కొండమీద వున్న శివపార్వతుల విగ్రహము చూడదగినది.

**17. ఇందిరా జూలాజికల్ పార్కు :** 425 ఎకరాల స్థలంలో వున్నా ఈ పార్కులో ఎన్నో జంతువులు చూడదగినవి వున్నాయి. సోమవారం సెలవు దినం.

**18.లైట్‌హౌస్ :** కొండమీద లైట్‌హౌస్ చూడదగినది. ఇచ్చట వేంకటేశ్వరుని ఆలయం, సాగర దుర్గా ఆలయం చూడదగినవి. డాల్ఫిన్ నోస్‌లైట్ హౌస్ (64 కి.మీ. పరిధి) విశాఖ ఉక్కు కర్మాగారం, నౌకా నిర్మాణ కేంద్రం చూడదగినది.

**19. బీచ్‌లు పార్కులు :** 1) రుషికొండ బీచ్ 2) రామకృష్ణా బీచ్ 3) పాత ఉడాపార్కు 4) కొత్త ఉడాపార్కు 5) శివాజి పార్కు. పిల్లలతో కలిసి వెళ్ళి చూడదగిన ముఖ్యమైన పార్కులు.

**20. అరకులోయ :**రైలు మార్గము ద్వారా విశాఖపట్టణము నుండి 132 కి.మీ. బస్సు ద్వారా 115 కి.మీ.లలో వున్నది. చలికాలములో ఎక్కువ మంది సందర్శిస్తూ ఉంటారు. "అరకు అనగా ఎర్రమట్టి". సముద్ర మట్టానికి 600 నుండి 900 మీటర్లు ఎత్తులో వుంటుంది. లోయకు చేరే ఘాట్‌రోడ్డు ప్రయాణము అద్భుతముగా వుంటుంది. పద్మాగార్డెన్స్, రణజల్లెడ జలపాతం దర్శనీయమైనది. అరకు "పేదల ఊటి"గా పేరు గావించినది.

**21. కిరండోల్ రైలు మార్గము :** 52 సొరంగాలు ద్వారా ఈ మార్గం అతి ఎత్తయిన బ్రాడ్ గేజ్ హిల్ స్టేషన్ వున్నది. దీని 996.2 మీటర్లు. సిమిలి గూడ రైల్వే స్టేషన్ సముద్ర మట్టానికి 3.268 అడుగులు ఎత్తులో వున్నది. అతి ఎత్తయిన రైల్వేస్టేషన్.

**22. గిరిజనుల మ్యూజియం :** గిరిజనులకు సంబంధించిన ఒక మ్యూజియం అరకు లోయలో వున్నది. అనేక కొండజాతులవారు అరకులోయలో నివసిస్తున్నారు.

**23.ఈస్ట్ షిరిడి :** విశాఖ నగరములోని ఈస్ట్ పాయింట్ కాలనీలో శ్రీ సాయిబాబా దేవాలయములలో ముఖ్యమైనది. షిరిడిని తలపించే విధముగా వుండే ఆలయం.

**24.సీతమ్మధారబాబాగుడి :** విశాఖ నగరములో శ్రీ సాయిబాబా ఆలయం గురువారం రోజున ఈ ఆలయం చూడవలసినది.

**23.సంపత్ వినాయకుడు :** విశాఖనగరములో ఆశీల్‌మెట్ట జంక్షన్‌లోని సంపత్ వినాయకుని గుడి ప్రతి ఒక్కరు చూచి తీరవలసినదే. ఇదే కాక విశాఖ నగరములో 12 గణపతి దేవాలయములు వున్నవి.

**24. కృష్ణదేవిపేట :** అల్లూరి సీతారామరాజు సమాధి మందిరము వున్నది ఇక్కడే!.

**25. కాళీమాత ఆలయం :** విశాఖ పట్టణములో రామకృష్ణ బీచ్‌నందు రామకృష్ణ మఠం వారిచే ఆరాధించబడు కాళీమాత ఆలయం దర్శించదగినది.



**26. శ్రీ కనకమహాలక్ష్మి ఆలయం :** విశాఖపట్టణములో వన్‌టౌన్‌లో బురుజుపేటలో కనకమహాలక్ష్మి దేవాలయం దర్శించగలరు. ప్రతి గురువారం విశేష అర్చనలు, మార్గశిరమాసములో అమ్మవారి ఉత్సవములు జరుపబడును.

**27. శ్రీ చక్ర శ్రీమేరు ఆలయం :** విశాఖకు 20 కి.మీ. దూరములో పెందుర్తి-అనకాపల్లి రోడ్డుమీద కుడివైపున కలదు.

**28. శివానంద మహారాజ్ ఆశ్రమం :** విశాఖపట్టణములో సింహాచలం దారపాలెంలో నిర్మించినారు. ఎంతో చక్కని ప్రదేశములో దత్తదేవాలయం అనేక మహానుభావుల అవధూతల విగ్రహాలు దర్శించవచ్చును.

## 4. తూర్పుగోదావరి జిల్లా

1. **వైశాల్యం** : 10,807 చ.కి.మీ.
2. **జనాభా** : 50,00,000
3. **అక్షరాస్యత** : 53%
4. **మండలాలు** : 57
5. **నదులు** : గోదావరి, ఏలేరు
6. **అడవులు** : 31 శాతం (రక్షిత అటవీ ప్రాంతం)
7. **పంటలు** : వరి, జొన్న, పొగాకు, వేరుశనగ, చోళ్ళు, చెఱకు, కంది, అరటి, కొబ్బరి, మామిడి, జీడిమామిడి, పనస.
8. **ఖనిజాలు** : గ్రానైట్, సహజవాయువులు, పెట్రోలియం, సున్నపురాయి, బంకమట్టి.
9. **పరిశ్రమలు** : విద్యుత్, పాల ఉత్పత్తులు, జౌళి, స్పిన్నింగ్, పింగాణి మూస, పేపర్, ఎరువులు, కొబ్బరితో కొన్ని చిన్నతరహా పరిశ్రమలు, చేనేత.
10. **కాకినాడ, రాజమండ్రి నుండి ఈ జిల్లాలోని ముఖ్యప్రాంతాలకు గలదూరం (కి.మీ.లలో)**

| పట్టణం/నగరం | రాజమండ్రి | కాకినాడ | పట్టణం/నగరం | రాజమండ్రి | కాకినాడ |
|---|---|---|---|---|---|
| అమాలాపురం | 75 | 92 | పిఠాపురం | 75 | 20 |
| అడ్డతీగల | 82 | 100 | తుని | 100 | 80 |
| రావులపాలెం | 35 | -- | రాజోలు | 100 | 120 |

11. **సరిహద్దులు** : తూర్పు - బంగాళాఖాతం
పశ్చిమ - ఖమ్మం, ప॥గో॥జిల్లా
ఉత్తరం - మధ్యప్రదేశ్
దక్షిణం - బంగాళాఖాతం

**12. ముఖ్యకేంద్రం** : కాకినాడ పట్టణం

**13. రైల్వేస్టేషన్** : రాజమండ్రి సౌత్ సెంట్రల్ రైల్వే

**14. ప్రధాన పట్టణాలు :** కాకినాడ, రాజమండ్రి, సామర్లకోట, అమలాపురం, పిఠాపురం, పెద్దాపురం, రామచంద్రపురం, మండపేట, ధవళేశ్వరం, రాజోలు, తుని.

**15. మండలాలు(57) :** 1. తాళ్లరేవు 2. కాజులూరు 3. కరప 4. కాకినాడ (రూరల్) 5. సామర్లకోట 6. పెదపూడి 7. పిఠాపురం 8. గొల్లప్రోలు 9. కొత్తపల్లి 10. ప్రత్తిపాడు 11. ఏలేశ్వరం 12. శంఖవరం 13. పెద్దాపురం 14. కిర్లంపూడి 15. జగ్గంపేట 16. గండేపల్లి 17. రంగంపేట 18. తుని 19. తొండంగి 20. కోటనందూరు 21. అడ్డతీగల 22. రాజవొమ్మంగి 23. వై. రామవరం 24. గంగవరం 25. రంపచోడవరం 26. దేవీపట్నం 27. మారేడుమిల్లి 28. రాజమండ్రి (రూరల్) 29. రాజానగరం 30. కడియం 31. కోరుకొండ 32. గోకవరం 33. సీతానగరం 34. రాయవరం 35. బిక్కవోలు 36. అనపర్తి 37. రామచంద్రపురం 38. పామర్రు 39. ఆలమూరు 40. మండపేట 41. కపిలేశ్వరపురం 42. సఖినేటిపల్లి 43. మల్కిపురం 44. రాజోలు 45. మామిడికుదురు 46. పి. గన్నవరం 47. రావులపాలెం 48. ఆత్రేయపురం 49. కొత్తపేట 50. అంబాజీపేట 51. అమలాపురం 52. అల్లవరం 53. ఉప్పలగుప్తం 54. ఐనవల్లి 55. ముమ్మిడివరం 56. కాట్రేని కోన 57. ఐ. పోలవరం.

**16. జిల్లా చరిత్ర :** కళింగ సామ్రాజ్యానికి సరిహద్దుగా ఉండే ఈ ప్రాంతాన్ని రాజన్యులు, మధుర పుత్రులు గంగ వంశం రాజులు తొలుత పాలించారు. ఏడో శతాబ్దంలో రెండో పులకేశి పిఠాపురం కోటను వశపర్చుకొన్నాడు. పదో శతాబ్దంలో తూర్పు చాళుక్యులకు చెందిన భీమచాళుక్యుడు ఈ ప్రాంతాన్ని పాలించాడు. పన్నెండో శతాబ్దం నుంచి 14 వరకు ఈ ప్రాంతం కాకతీయుల పాలనలో ఉంది. ఈ తరువాత 1364-1386 వరకూ రెడ్డి రాజులు పాలించారు. 1785లో బ్రిటిష్, ఫ్రెంచి సేనల మధ్య-చందుర్తి అనే ప్రాంతంలో చందుర్తి యుద్ధం జరిగింది. గోదావరి నదీ ప్రవాహాన్ని ఆధారంగా చేసుకొని పెద్దదైన గోదావరి జిల్లాను పోలవరం వైపున ప్రాంతాన్ని తూర్పు గోదావరిగా, పడమటి ప్రాంతాన్ని పశ్చిమగోదావరిగా విభజించారు. రాజరాజనరేంద్రుని ముఖ్య పట్టణమైన రాజమహేంద్రవరమే తరువాత రాజమండ్రిగా మారి ప్రముఖ వాణిజ్య కేంద్రమైంది.



## తూర్పు గోదావరి జిల్లాలోని దర్శనీయ స్థలాలు

**1. అన్నవరం:**రాజమండ్రికి 80 కి.మీ. దూరములో కొండమీద వీరవేంకట సత్యనారాయణస్వామి, అనంతలక్ష్మి, సత్యవతిదేవి, వెలసిన క్షేత్రం. ఎండ గడియారం చూడదగినది. రెండు అంతస్థులు గల ఆలయం.

**2. పిఠాపురం :** కాకినాడకు 15 కి.మీ. దూరంలో వున్నది. ఇచ్చట పాదగయ, కుక్కుటేశ్వరస్వామి, పురుహూతికా, దత్తాత్రేయుడు మరియు కుంతి మాధవస్వామి ఆలయములు ఉన్నవి. అంతేకాక శ్రీ పాదవల్లభస్వామి గురుచరిత్ర మొదటి అవతారం ఇచ్చటనే. ఇచ్చట శ్రీ పాదవల్లభ సంస్థానాలు మూడు వున్నాయి. పురుహూతికా అమ్మవారు అష్టాదశ పీఠాలలో ఒక పీఠం. అమ్మవారికి బంగారు చీర కలదు. శుక్రవారం కడతారు. ఒక శ్రీ పాదవల్లభా సంస్థానము శ్రీ గణపతి సచ్చిదానంద స్వామి వారిచే కట్టించిబడినది.

**3. సామర్లకోట :**కాకినాడకు 13 కి.మీ. దూరములో పంచారామంలో ఒకటైన కుమారస్వామిచే ప్రతిష్ఠించబడిన కుమార భీమేశ్వరస్వామి ఆలయం ఉన్నది.

**4. రాజమండ్రి :**గోదావరి గట్టున కోటిలింగేశ్వర, మార్కండేయ, వేణుగోపాల స్వామి దేవాలయములు కలవు. మరియు దేవిచౌక్, పేపర్ మిల్లు గేటువద్ద, శ్రీ సాయిబాబా మందిరములో, ప్రపంచములో మొదటిసారిగా స్థాపించబడిన ఓం శ్రీ సాయిరాం నామకోటి స్థూపము చూడదగినవి.

**5. బూరుగుపూడి :** ఇచ్చట దక్షిణ షిర్డి అను పేరుతో అత్యద్భుతముగా శ్రీ సాయిబాబా ఆలయం నిర్మించినారు. ఇచ్చట గురుస్థానం, దత్తపాదుకులు, భిక్షాటన బాబా విగ్రహం చూడవలసినవి. నిత్య అన్నదానం జరుపుచున్నారు. దీని వ్యవస్థాపరులు గురుదేవులు ఆదిపూడి మోహన్‌రావు మహారాజ్‌గారు. వీరికి గురుస్థానం ఏర్పాటు చేసినారు.

**6. కోరుకొండ :** రాజమండ్రికి 20 కి.మీ. దూరములో కొండమీద లక్ష్మీ నరసింహాస్వామి చాలా ప్రాచీనమైనది మరియు సుబ్రహ్మణ్యస్వామి మందిరము ఊరిబయట పెట్రోలుబంకు వద్ద శ్రీ సాయిబాబా మందిరములో శ్రీ గురుదేవులు ఆదిపూడి మోహనరావు మహారాజ్‌గారి విగ్రహమును ప్రతిష్ఠించినారు. ఊరిలోపల శ్రీ సాయిబాబా మందిరములో శ్రీ గురుదేవులు ఆదిపూడి మోహనరావు మహారాజ్‌గారి పెద్దపటము ఆవిష్కరించినారు.

**7. ర్యాలి:** రాజమండ్రి 35 కి.మీ. దూరములో జగన్మోహినీ కేశవస్వామిని ప్రతి ఒక్కరూ దర్శించవలసినదే. విగ్రహం వెనుక జగన్మోహినీ స్త్రీ రూపం ముందర విష్ణు రూపం. ఉమాకముండలేశ్వరస్వామి ఆలయం కూడా దర్శించదగినది.

**8. పెద్దాపురం :**సామర్లకోటకు 4 కి.మీ. దూరములో పెద్దాపురం కొండమీద శ్రీ సూర్యనారాయణస్వామి దేవాలయం చాలా విశేషమైనది. ఇచ్చట ప్రత్యేకముగా

శని విగ్రహము కూడా కలదు. మరియు మరిడమ్మ అమ్మవారి క్షేత్రము దర్శించదగినది.

**9. మందపల్లి :** కొత్తపేటకు 4 కి.మీ. దూరములో మందపల్లి శనిచే ప్రతిష్ఠించబడిన లింగరూపములో ఉంటాడు. ఇచ్చట నాగేశ్వరస్వామి, బ్రహ్మేశ్వరస్వామి మరియు వేణుగోపాలస్వామి ఆలయములు కలవు. రావులపాలెం నుండి ఆటోలో వెళ్లగలరు. శని త్రయోదశి వేలాది భక్తులు తరలి వస్తారు.

**10. ముక్తీశ్వరం :** అమలాపురంనకు 12 కి.మీ. దూరములో గల క్షణముక్తేశ్వరస్వామి అత్యంత విశేషతను సంతరించుకున్నది. రాజమండ్రికి 90 కి.మీ. దూరములో వున్నది.

**11. ధవళేశ్వరం :** ఇచ్చట గల అగస్త్యేశ్వరస్వామి దేవాలయం చాల విశేషమైనది. కొండపైన సీతారాముల పాదముద్రలు కలవు. గోదావరి నది కాటన్ బ్యారేజి ఆనకట్టు కట్టినారు. జనార్ధనస్వామి దేవాలయం చూడదగినది. శ్రీ సాయిబాబా నల్లరాతి విగ్రహముతో వున్న దేవాలయం చూడదగినది. రాజమండ్రికి 3 కి.మీ. దూరములో వున్నది.

**12. అంతర్వేది :** రాజోలు 25 కి.మీ.దూరములో శ్రీ లక్ష్మీ నరసింహస్వామి దేవస్థానం చాలా ప్రఖ్యాతమైనది. ఇచ్చట నీలకంఠేశ్వరస్వామి క్షేత్రపాలకుడు. రాజమండ్రికి 100 కి.మీ. దూరములో వున్నది.

**13. ద్రాక్షారామం :** కోటిపల్లికి 13 కి.మీ. దూరములో దక్షిణకాశీ క్షేత్రములు. శివలింగము చాలా పెద్దది. ఈ ఆలయం చాలా పెద్దది. మాణిక్యాంబ అమ్మవారు. రాజమండ్రికి 40 కి.మీ. దూరములో వున్నది. ఇది పంచారామములలో ఒకటి. అమ్మవారు అష్టాదశ పీఠములలో ఒక పీఠమని ప్రతీక. అంతేగాక శ్రీలక్ష్మీనరసింహ స్వామి దేవాలయం దర్శించగలరు.

**14. కోటిపల్లి :** రాజమండ్రికి 60 కి.మీ. దూరములో వున్న కోటిపల్లి చాలా శివక్షేత్రము. సోమేశ్వరస్వామి, కోటేశ్వరస్వామి వున్నారు. ఈ క్షేత్రము ధ్యానంగానీ, జపం గాని చేస్తే కోటిరెట్లు ఫలితమిస్తుందని చెపుతారు. ద్రాక్షారామంకు 5 కి.మీ. దూరములో వున్నది.

**15. సర్పవరం :**కాకినాడకు 6 కి.మీ. దూరములో ఈ గ్రామంలో భావనారాయణ స్వామి ఆలయం చాలా ప్రాచీనమైనది. ఇక్కడ నారద గుండము, ముక్తి గుండము కలవు.

**16. ద్వారపూడి :** అనేక దేవాలయ సముదాయములతో అయ్యప్పస్వామి గుడి అద్భుతముగా నిర్మించబడినది. ద్వాదశ జ్యోతిర్లింగములు, తప్పక దర్శించదగినవి.

**17. పట్టిసము :** అత్యంత ప్రాముఖ్యత కలిగిన వీరభద్రస్వామి దేవాలయం చూడగలరు.

**18. మామిడాడ :** జైజైనారాయణ స్వామి దేవాలయం తప్పక దర్శించగలరు. 11 అంతస్థులు గల శ్రీ కోదండరామస్వామి దేవాలయము ఆంధ్రలోనే లేదు.



**19. కోరంగి :** ఇచ్చట గల కురంగేశ్వరస్వామి దేవాలయం చూడగలరు.

**20. కాకినాడ :** కాకినాడ పట్టణములో శ్యామలాదేవి దేవాలయం దర్శించగలరు.

**21. కడలి :** కపోతేశ్వరస్వామి దేవాలయం జగ్గంపేట సమీపాన వున్నది.

**22. పలివెల :** ఎక్కడ లేని కొప్పులింగేశ్వరస్వామి దేవాలయం ఇచ్చట కలదు. కొత్తపేటకు 3 కి.మీ. దూరములో వున్నది. శివలింగమునకు స్త్రీ వలె కొప్పు వుంటుంది.

**23. పులగుర్తం :**ప్రతి ఒక్కరు చూడదగిన సిద్ధివినాయకస్వామి దేవాలయం ఇచ్చట కలదు.

**24. అయినవిల్లి:**వినాయకస్వామి దేవాలయం అత్యంత విశేషతను సంతరించు కొన్నది. మరియు విశ్వేశ్వరస్వామి దేవాలయం, కేశవస్వామి దేవాయం భక్తులు దర్శించదగినవి.

**25. నగరం :**ఇచ్చట గల వీరేశ్వర వీరభద్ర స్వామి దేవాలయం తప్పక దర్శించదగినది.

**26. బిక్కవోలు :** సుబ్రహ్మణ్య స్వామి దేవాలయం, రాజరాజేశ్వరస్వామి దేవాలయం, గణపతి దేవాలయము చూడదగినవి.

**27. తాపేశ్వరం :** ఆలమూరు తాలూకాలోని తాపేశ్వరంలో అగస్త్యేశ్వరస్వామి దేవాలయం.

**28. రాజోలు :**రాజోలులోని నర్మదలింగేశ్వరస్వామి దేవాలయం దర్శించగలరు.

**29. లోవకొత్తూరు :** తుని 5 కి.మీ. దూరములో తలుపులమ్మ దేవాలయం. భక్తులు ఎక్కువ మంది దర్శిస్తారు. తీగకొండ – దారకొండల మధ్య లోయలో కొండ గుహయందు సుమారు 200 అడుగుల ఎత్తులో వున్నది. ప్రతి ఆది మంగళవారములు ఎక్కువమంది దర్శిస్తారు.

**30. అప్పనపల్లి :** బాల బాలాజీ (వేంకటేశ్వరస్వామి) దేవాలయం, తిరుపతి దర్శించలేనివారు ఈ క్షేత్రమును దర్శిస్తుంటారు. రాజమండ్రికి 80 కి.మీ. దూరంలో వున్నది.

**31. వెదురుపాక :** గాడ్‌గారు స్థాపించిన విజయదుర్గదేవి పీఠము భక్తులు దర్శిస్తూంటారు. మంగళవారం రోజున ఎక్కువమంది వస్తారు.

**32. లొల్ల :**రాయవరం మండలం లొల్లలోని రామలింగేశ్వరస్వామి దేవాలయం దర్శించగలరు.

**33. రాఘవపురం :**కోరుకొండ మండలము రాఘవపురంలో శ్రీరామ దేవాలయం చూడగలరు.

**34. బెండమూర్లంక :**అల్లవరం మండలము బెండుమూర్లంకలో శ్రీ వేంకటేశ్వరస్వామి దేవాలయం దర్శించగలరు.

**35. మురమళ్ళ:**వీరేశ్వరస్వామి దేవాలయము మరియు భద్రకాళీ అమ్మవారు.

**36. గుత్తిందీవి :** ముమ్మిడివరం తాలూకాలో గుత్తిందీవిలో ఆంజనేయస్వామి దేవాలయం దర్శించగలరు.

**37. సోంపల్లి :**కోనసీమ ప్రాంతములో సోంపల్లి పుణ్యక్షేత్రంలో గోదావరి నది పడమరగా ప్రవహిస్తుంది.

**38. కోనసీమ :** కొబ్బరికాయలతో మూడు వైపులా గోదావరి లంక గోదావరి లంక వైపు బంగాళఖాతం వున్నది. కోనసీమ ప్రాంతములలో అమలాపురం, ముక్తేశ్వరం, రాజోలు, అయినవిల్లి, అప్పన పల్లి, అంతర్వేది, ముమ్మిడివరం, క్రొత్తలంక మొదలగు నగరములు కోనసీమలోనివి.

**39. రాజానగరం :**రాజానగరం రకరకాల విహంగ విహర కేంద్రంగా ఉన్నది. అనేక మంది యాత్రికులు చూడటానికి వస్తారు.

**40. కాకినాడ ఓడరేవు :** 100 కి.మీ. వైశాల్యముతో వున్న ఈ ఓడరేవు విహర యాత్రకు ఎంతో అనువైన ప్రదేశము.

**41. లైట్ హౌస్ :** సఖినేటిపల్లి మండలంలో అంతర్వేది ప్రాంతములో లైట్‌హౌస్ చూడదగినది. ప్రముఖ యాత్ర స్థలం.

**42. కడియం :** ఈ ప్రాంతములో 500 ఎకరాలలో 300 నర్సరీ తోటలు వున్నాయి. రాజమండ్రికి 15 కి.మీ. దూరములో వున్న కడియంలో కనీసం 50 రకాల గులాబీ మొక్కలు వున్నాయి.

**43. రామచంద్రపురం కోట:** అనేక సినిమాలు తీయటానికి ఈ కోటను ఉపయోగిస్తారు. ఇందులోని శిల్ప చాతుర్యము చూడవలసినదే.

**44. పాండవుల మెట్ట :** రాజమండ్రికి – పెద్దాపురం మధ్యగల రహదారిలో జగ్గంపేటకు దగ్గరలో పాండవుల మెట్టలో భీమపాద ముద్రికలు, గద ఆకారం రాతిపై చెక్కి వుంటాయి. అందరు దర్శించదగినది.

**45. సీతానగరం :** రాజమండ్రికి 22 కి.మీ. దూరములో వున్న సీతానగరంలో కస్తూరి బాయి గాంధీ ఆశ్రమం చూడదగినది.

**46. కొవ్వాడ :** కాకినాడ రూరల్ మండలములో కొవ్వాడలోని శ్రీసాయిబాబా మందిరము చాలా ప్రఖ్యాతిమైనది. ప్రతి ఒక్కరూ దర్శించగలరు.





## రాజమండ్రి సమీపంలో గల యాత్ర స్థలములు-దేవాలయాలు

| | ఊరు | సుమారుదూరం | దేవాలయం | మార్గం |
|---|---|---|---|---|
| 1. | ధవళేశ్వరం | - 6 కి.మీ. | - లక్ష్మీనరసింహస్వామి | - సిటీబస్‌లు |
| 2. | ద్వారపూడి | - 20 కి.మీ. | - అయ్యప్ప ఆలయము | - రైలు+బస్సు |
| 3. | ద్వారపూడి | - 20 కి.మీ. | - ఎత్తైన శివలింగము | - రైలు+బస్సు |
| 4. | మందపల్లి | - 34 కి.మీ. | - శనీశ్వరాలయము | - బస్సు |
| 5. | బిక్కవోలు | - 43 కి.మీ | - శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరస్వామి | - రైలు+బస్సు |
| 6. | కొరుకొండ | - 17 కి.మీ. | - శ్రీ లక్ష్మీ నరసింహస్వామి | - బస్సు |
| 7. | కోటిపల్లి | - 52 కి.మీ. | - శ్రీ సోమేశ్వరస్వామి | - బస్సు |
| 8. | సోమేశ్వరం | - 36 కి.మీ. | - శ్రీ సోమేశ్వరస్వామి | - బస్సు |
| 9. | తంటికొండ | - 38 కి.మీ. | - శ్రీ వేంకటేశ్వరస్వామి | - బస్సు |
| 10. | పెద్దాపురం | - 44 కి.మీ. | - మరిడమ్మ అమ్మవారు | - బస్సు |
| 11. | గొల్లలమామిడాడ | - 43 కి.మీ. | - శ్రీసూర్యనారాయణస్వామి+రామాలయం | - బస్సు |
| 12. | ర్యాలి | - 42 కి.మీ. | - జగన్మోహినీ కేశవస్వామి+శివాలయం | - బస్సు |
| 13. | ద్రాక్షారామం | - 46 కి.మీ. | - శ్రీ భీమేశ్వరస్వామి | - బస్సు |
| 14. | సామర్లకోట | - 50 కి.మీ. | - కుమార భీమేశ్వరస్వామి | - రైలు+బస్సు |
| 15. | పెనుగొండ | - 45 కి.మీ. | - శ్రీవాసవీకన్యకాపరమేశ్వరీ | - బస్సు |
| 16. | పలివెల | - 44 కి.మీ. | - శ్రీ కొప్పులింగేశ్వరస్వామి | - బస్సు |
| 17. | పట్టిసీమ | - 43 కి.మీ. | - శ్రీవీరభద్రస్వామి ఆలయం | - లాంచీ+బస్సు |
| 18. | జొన్నాడ | - 30 కి.మీ. | - శివాలయం | - బస్సు |
| 19. | చింతలూరు | - 30 కి.మీ. | - శ్రీ నూకాంబికఅమ్మవారు | - బస్సు |
| 20. | కొవ్వూరు | - 8. కి.మీ. | - శ్రీ గోష్పాదక్షేత్రము-బాలాజి | - రైలు+బస్సు |
| 21. | నిడదవోలు | - 20 కి.మీ | - కోటసత్తెమ్మగుడి | - రైలు+బస్సు |
| 22. | కాండ్రకోట | - 50 కి.మీ. | - నూకాలమ్మవారు | - బస్సు |
| 23. | పిఠాపురం | - 70 కి.మీ. | - శ్రీ కుక్కుటేశ్వరస్వామి | - రైలు+బస్సు |
| 24. | మురమళ్ళ | - 70 కి.మీ. | - భద్రకాళీ సమేత వీరేశ్వరస్వామి | - బస్సు |
| 25. | భీమవరం | - 70 కి.మీ. | - మావుళ్ళమ్మ అమ్మవారు | - రైలు(67)బస్సు(80) |
| 26. | భీమవరంలోని గునుపూడిలో | - 70 కి.మీ. | - జనార్ధనస్వామి | - రైలు(67)బస్సు(80) |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 27. అయినవల్లి | - | 77 కి.మీ. | - | శ్రీ వినాయక స్వామి | - | బస్సు |
| 28. పాలకొల్లు | - | 80 కి.మీ. | - | శ్రీ క్షీరా రామలింగేశ్వరస్వామి | - | రైలు(78)బస్సు(90) |
| 29. కుండలేశ్వరం | - | 75 కి.మీ. | - | శ్రీ కుండలేశ్వరస్వామి | - | బస్సు |
| 30. అన్నవరం | - | 80 కి.మీ. | - | శ్రీ సత్యన్నారాయణస్వామి | - | రైలు+బస్సు |
| 31. లోవ (తలుపులమ్మలోవ) | - | 94 కి.మీ. | - | తలుపులమ్మ తల్లి | - | బస్సు |
| 32. కడలి | - | 86 కి.మీ. | - | కపోతేశ్వరస్వామి | - | బస్సు |
| 33. అప్పనపల్లి | - | 81 కి.మీ. | - | శ్రీ బాల బాలాజీ | - | బస్సు |
| 34. సర్పవరం | - | 66 కి.మీ. | - | శ్రీ భావనారాయణస్వామి | - | బస్సు |
| 35. ముమ్మిడివరం | - | 77 కి.మీ. | - | శ్రీ పెదబాలయోగి-చినబాలయోగిల సమాధులు | - | బస్సు |
| 36. మొసలిపల్లి | - | 100 కి.మీ. | - | శ్రీ భోగలింగేశ్వరస్వామి | - | బస్సు |
| 37. అంతర్వేది | - | 110 కి.మీ. | - | శ్రీ లక్ష్మీ నరసింహస్వామి | - | బస్సు |
| 38. కేశనకుర్రు | - | 96 కి.మీ. | - | శివుని ఆలయము | - | బస్సు |
| 39. ఆదుర్రు | - | 98 కి.మీ. | - | బౌద్ధుని స్తూపం గలదు | - | బస్సు |
| 40. పెదపట్నం | - | 96 కి.మీ. | - | శ్రీ మూలేశ్వరస్వామి | - | బస్సు |
| 41. ముక్తేశ్వరం | - | 94 కి.మీ. | - | శ్రీ ముక్తేశ్వరుడు | - | బస్సు |

42. గుర్వాయిగూడెం మద్ది - ఆంజనేయస్వామి గుడి ఇది జంగారెడ్డిగూడానికి 4 కి.మీ. దూరంలో, ద్వారకా తిరుమలకు 20 కి.మీ. దూరంలో గలదు.

43. ద్వారకా తిరుమల (చిన్న తిరుమతి) - శ్రీ వేంకటేశ్వరస్వామి (భీమడోలు వరకు రైలులో వెళ్ళి అచట దిగి ఆర్.టి.సి. బస్సులో వెళ్ళవలెను. భీమడోలు 60 కి.మీ. అచట నుండి 22కి.మీ. దూరంలో గలదు.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 44. ఏలూరు | - | 80 కి.మీ. | - | వరాహపరేశ్వరస్వామి | - | రైలు+బస్సు |
| 45. అత్తిలి | - | 50 కి.మీ. | - | ఉమాసిద్దేశ్వరస్వామి | - | రైలు |
| 46. పోణంగి | - | | - | శ్రీ వైనతేయేశ్వరస్వామి | - | బస్సు |
| 47. పలివెల | - | | - | ఉమా కొప్పేశ్వరస్వామి | - | బస్సు |
| 48. పాలంగి | - | | - | శ్రీ రామలింగేశ్వరస్వామి | - | బస్సు |
| 49. నత్తారామేశ్వరం | - | | - | శ్రీ రామలింగేశ్వరస్వామి | - | బస్సు |
| 50. యనమదురు | - | | - | శ్రీ శక్తేశ్వరస్వామి | - | బస్సు |
| 51. ముగ్గళ్ల | - | | - | శ్రీవల్లీసుబ్రహ్మణ్యేశ్వరుడు | - | బస్సు |



## రాజమండ్రిలో చూడవలసిన దేవాలయములు

1. శివాలయము
2. కనకదుర్గ
3. బ్రహ్మంగారు
4. నవగ్రహములు
5. పాండురంగడు
6. గాయత్రీ దేవి - వేంకటేశ్వరుడు, అయ్యప్ప స్వామి

(1-6) ఈ దేవాలయములు అన్నియు పుష్కరాలరేవులో ఒకేచోట గలవు.

7. ఉమా కోటిలింగేశ్వరస్వామివారి దేవాలయము - కోటిలింగాలు రేవువద్ద గలదు.
8. వరాహలక్ష్మీ నరసింహస్వామి వారి దేవలయము - ఇది రామదాసు పేటలో గలదు. (కోరుకొండ రోడ్డులో)
9. వల్లీ సుబ్రహ్మణ్యని దేవాలయము ఇదికూడా కోరుకొండ రోడ్డులో గలదు.
10. సారంగధరేశ్వర ఆలయము - ఇది సారంగధరమెట్టవద్ద గలదు.
11. అష్టలక్ష్మి (మహాలక్ష్మీ+సంతోషిమాత దేవాలయములు) - ఇవి ఆనాల వేంకట అప్పారావు రోడ్డులో గలవు. ఇవి తప్పక దర్శించదగినవి.
12. శ్రీ శ్యామలాంబా (రాజమండ్రి గ్రామదేవత) అమ్మవారుగుడి - అప్సరా థియేటర్ వద్దగలదు. ఇచ్చట రామాలయం కూడా గలదు.
13. శ్రీ వేంకటేశ్వరస్వామి దేవాలయము - ఈ దేవాలయములో (వినాయకుడు-అమ్మవారు, -అయ్యప్ప-సత్యనారాయణస్వామి మొదలగు ఆలయములు కూడా కలవు. ఇది మెయిన్‌రోడ్ దగ్గరలో నల్లమందు సందులో గలదు.
14. పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామి వారిగుడి - ఇది కూడా నల్లమందు సందులో కలదు.
15. గంటాలమ్మవారి గుడి - ఇది మెయిన్‌రోడ్‌కు దగ్గరలోనే గలదు. (గంటాలమ్మ గుడివీధి)
16. శ్రీ ఉమారామలింగేశ్వరుని ఆలయం - ఇది జాంపేట సెంటర్ నందు గలదు.
17. శ్రీదేవి కనకదుర్గా ఆలయం సౌధం - ఇది దేవిచౌక్ వద్ద గలదు.
18. చౌడేశ్వరస్వామి ఆలయం - ఇది లక్ష్మివారపుపేటలో గలదు.
19. శ్రీ కోదండరాముని ఆలయం - ఇది లక్ష్మివారపుపేటలో గలవు.
20. శ్రీ సత్యనారాయణ స్వామి -
21. శ్రీ లక్ష్మి గణపతి ఆలయం -
22. శ్రీ కృష్ణ చైతన్య మఠం -

(20-22) ఇవి ఆర్యాపురంలో గలవు. శివజ్యోతి థియేటర్ వెనుక వీధిలో గలవు.

23. ఆంజనేయస్వామిఆలయం (పెద్ద ఆంజనేయస్వామి) -
24. శ్రీ షిర్డిసాయిబాబా దేవాలయము -
25. శ్రీ ఆదిలక్ష్మి అమ్మవారి దేవాలయం -

(23-25) ఇవి పుష్కరాల రేవుకు అతి దగ్గరలో గలవు.

26. శ్రీ జూహీలాల్ సింధీల మందిరం -
26. శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరి ఆలయం -
27. ఉమా మార్కండేయస్వామి (ఈ దేవాలయములో అమ్మవారు, నవగ్రహాలు, అయ్యప్ప మొదలగు ఆలయములు గలవు)
28. శంకర మఠము -
29. శ్రీ రాఘవేంద్రస్వామి మఠం -
30. చిన్న ఆంజనేయస్వామిగుడి -
31. శ్రీ కనకదుర్గమ్మ ఆలయం -

ఇవి అన్నియు గోదావరి గట్టున వరుసగా కలవు.

32. సత్యనారాయణస్వామి దేవాలయము -
33. శ్రీ రామాలయము -

ఇవి గుండువారి వీధిలో ఉన్నవి. ఇవి మెయిన్‌రోడ్‌కు అతి దగ్గరలో ఉన్నవి.

34. శ్రీ వినాయక ఆలయం -
35. శ్రీ అష్టలక్ష్మీదేవాలయము -
36. శ్రీ షిర్డిసాయిబాబా ఆలయం -

ఇవి మెయిన్‌రోడ్‌కు అతి దగ్గరలో గలవు. ఇవి పాత కూరగాయల మార్కెట్టు వద్ద గల వంకాయల వారివీధిలో గలవు.

37. శ్రీ లక్ష్మీ నరసింహని ఆలయం - కంభంవారి సత్రం వద్ద గలదు.
38. చంద్రమౌళి-విశ్వకర్మల దేవాలయము - కుమారి టాకీసు సమీపంలో గలదు.
39. శ్రీ విశ్వేశ్వరస్వామి దేవాలయం - ఇది రోడ్డు కం రైలు బ్రిడ్జి క్రింద గలదు.
40. శ్రీ ఆంజనేయస్వామి దేవాలయం - ఇది కోటిపల్లి బస్టాండ్‌వద్ద గలదు.
41. కన్నమాంబ దేవాలయం - ఇది రాజమండ్రి స్టేషన్ ఎదుట గలదు.
42. శ్రీ షిర్డి సాయిబాబా -
43. శ్రీ జనార్ధన స్వామిగుడి -
44. శ్రీ కోదండ రామాలయం -
45. శ్రీ అగస్త్యేశ్వరస్వామి ఆలయం -

ఇవి రాజమండ్రి సమీపంలో గల ధవళేశ్వరంలో గలవు.

46. శ్రీ కనకదుర్గా ఆలయం -
47. శ్రీ కోదండ రామాలయం -

ఇవి అన్నపూర్ణ టాకీసు సమీపంలో గలవు.

48. శ్రీ వేణుగోపాలస్వామి గుడి - ఇది గోదావరి గట్టుకు అతి సమీపంలో గలదు.
49. కోదండ రామాలయం - ఇది నూతనంగా నిర్మించినారు. అప్సర థియోటర్ ఎదుట గలదు.
50. శ్రీ సత్యనారాయణస్వామి గుడి - ఇది మెయిన్‌రోడ్డు సమీపంలో గల నూనెకొట్లు సందులో గలదు.



51. శ్రీ షిర్డిసాయి దేవాలయము - తిలక్‌రోడ్డులో
52. శ్రీ షిర్డిసాయి దేవాలయము - మేనక థియేటర్ ఎదుట
53. శ్రీ షిర్డిసాయిబాబా దేవాలయము - పేపరు మిల్లు వద్ద (ఓం శ్రీ సాయిరాం కోటిస్థూపం ఉన్నది)
54. శ్రీ షిర్డి సాయిబాబా మందిరం - జయరామ్ థియేటర్ వద్ద
55. వినాయకుని గుడి - శ్యామలాంబ (పాత) గుడి
56. శ్రీ సాయిధ్యానమందిరం - శ్రీ విశ్వేశ్వరాలయం (శ్యామలానగర్)
57. శ్రీ రామమందిరం - గోదావరి గట్టు - కరెంటు ఆఫీసు వెనుక
58. గీతాభవనము - వంకాయలవారి వీధిలో
59. గొల్లమారమ్మవారి గుడి - బెస్తావీధిలో
60. గణేశ్ సౌధం - గణేశ్ చౌక్



## రాజమండ్రిలో చూడవలసిన ప్రదేశాలు

1. కందుకూరి వీరేశలింగంగారి జన్మగృహం (ఇది టౌన్‌హాల్ సమీపంలో గలదు)
2. రాళ్ళబండి సుబ్బారావు పురావస్తుశాల (కుమారి థియేటర్ సమీపంలో గలదు)
3. సెంట్రల్‌జైలు
4. పేపరు మిల్లు
5. దామెర్ల ఆర్టుగేలరీ (ఇది గోకవరం బస్టాండు ఎదుట కలదు)
6. సర్ ఆర్ధర్ కాటన్ బేరేజి (ధవళేశ్వరం ఆనకట్ట) ధవళేశ్వరం.
7. కాటన్ మ్యూజియం (ధవళేశ్వరం)
8. రోడ్డు కం రైలు బ్రిడ్జి
9. దేవిచౌక్‌లోని దేవీమాత సౌధం
10. హర్లిక్స్ ఫ్యాక్టరీ (బొమ్మూరు వద్ద కలదు)
11. గౌతమీ గ్రంథాలయం (నాగదేవి థియేటర్ ఎదుట కలదు)
12. కందుకూరి వీరేశలింగం పంతులుగారి సమాధులు (ఆనంద గార్డెన్స్‌లో కలవు)
13. సారంగధరమెట్ట
14. తెలుగు విశ్వవిద్యాలయం (బొమ్మూరు రోడ్డులో కలదు)

# 5. పశ్చిమగోదావరి జిల్లా

1. వైశాల్యం : 7,742 చ.కి.మీ.
2. జనాభా : 45,17,000
3. అక్షరాస్యత : 58.4%
4. మండలాలు : 46 (895 గ్రామాలు)
5. నదులు : గోదావరి, తమ్మిలేరు, కొల్లేరు (సరస్సు), గాలేరు
6. అడవులు : 10%
7. పంటలు : చెఱకు, వేరుశెనగ, నువ్వులు, మినుములు, పెసలు, పొగాకు, వరి, జొన్న, పొగాకు, వివిధ పండ్ల తోటలు.
8. ఖనిజాలు : సుద్దరాయి, సున్నపురాయి, పెట్రోలియం, సహజవాయువు, గ్రానైట్
9. పరిశ్రమలు : ఇంజనీరింగ్ పరిశ్రమలు, రైస్‌మిల్లులు, పంచదార, ఎరువులు, రసాయనాలు, వ్యవసాయిక ఉత్పత్తులు.
10. విజయవాడ నుండి ఈ జిల్లాలోని ముఖ్యప్రాంతాలకు గలదూరం (కి.మీ.లలో)

| పట్టణం/నగరం | దూరం | పట్టణం/నగరం | దూరం |
|---|---|---|---|
| తాడేపల్లిగూడెం | 56 | చింతలపూడి | 50 |
| పాలకొల్లు | 90 | తణుకు | 75 |
| నరసాపురం | 100 | కొవ్వూరు | 90 |
| జంగారెడ్డిగూడెం | 55 | భీమవరం | 65 |

11. సరిహద్దులు : తూర్పు – తూ॥గోదావరి జిల్లా
పశ్చిమ – కృష్ణాజిల్లా
ఉత్తరం – ఖమ్మం జిల్లా
దక్షిణం – బంగాళాఖాతం
12. ముఖ్యకేంద్రం : ఏలూరు పట్టణం
13. రైల్వేస్టేషన్ : ఏలూరు, తాడేపల్లిగూడెం రైల్వేస్టేషన్‌లు
14. ప్రధాన పట్టణాలు: ఏలూరు, తణుకు, భీమవరం, పాలకొల్లు, తాడేపల్లిగూడెం, నరసాపురం, నిడదవోలు, కొవ్వూరు.

**15.మండలాలు(46) :**1. ఏలూరు 2. పెదపాడు 3. పెదవేగి 4. భీమడోలు 5. ద్వారకా తిరుమల 6. దెందులూరు 7. చింతలపూడి 8. లింగపాలెం 9. కామవరపుకోట 10. టి. నర్సాపురం 11. తాడేపల్లిగూడెం 12. గణపవరం 13. నల్లజెర్ల 14. నిడమర్రు 15. ఉంగుటూరు 16. పెంటపాడు 17. కొవ్వూరు 18. చాగల్లు 19. నిడదవోలు 20. దేవరపల్లి 21. గోపాలపురం 22. తాళ్లపూడి 23. పోలవరం 24. కొయ్యలగూడెం 25. జంగారెడ్డిగూడెం 26. బుట్టాయగూడెం 27. జీలుగుమిల్లి 28. తణుకు 29. ఇరగవరం 30. ఉండ్రాజవరం 31. అత్తిలి 32. పెనుమంట్ర 33. పెనుగొండ 34. పెరవలి 35. నర్సాపురం 36. మొగల్తూరు 37. ఎలమంచిలి 38. పాలకొల్లు 39. పోడూరు 40. ఆచంట 41. భీమవరం 42. పాలకోడూరు 43. వీరవాసరం 44. ఆకివీడు 45. పూళ్ళ 46. ఉండి.



**16.జిల్లా చరిత్ర :** తూర్పు గోదావరి, కృష్ణా జిల్లాల్లో భాగంగా ఉన్న కొన్ని ప్రాంతాలను వేరుచేసి గోదావరి నది పడమటి ప్రాంతాన్ని సరిహద్దు రేఖగా తీసుకొని పశ్చిమగోదావరి జిల్లాను ఏర్పాటుచేశాయి. క్రీ.పూ. నాలుగోశతాబ్దంలో శాతవాహనులు, ఆ తరువాత ఇక్ష్వాకులు, ఆనంద గోత్రులు, బృహత్ పలాయనులు, శాలంకాయన రాజు లేలిన ఈ ప్రాంతంలో పురావస్తు పరిశోధనలకు ముఖ్య ప్రదేశం. తూర్పు చాళుక్యులు, వెలనాటి చోళులు 14వ శతాబ్దం వరకూ పాలించిన ఈ ప్రాంత ప్రజలు మొదటి నుంచి కాలువల ఆధారంగా పంటలు పండించడంలో సిద్ధహస్తులు. ఏడాదికి సగటున 1052 మి.మీ. వర్షపాతంలో సారవంతమైన గోదావరి క్షేత్రంలో పుష్కలమైన పంటలతో పశ్చిమగోదావరి జిల్లా సుభిక్షమైన ప్రాంతం.

## పశ్చిమగోదావరి జిల్లాలోని దర్శనీయ స్థలాలు

**1. పెనుగొండ :** తాడేపల్లిగూడెంకి 35 కి.మీ దూరంలోమార్టేరుకి సమీపమున ఉన్న పెనుగొండలో కన్యకాపరమేశ్వరీ ఆలయానికి కొద్దిదూరంలో లింగాలవీధిలో కొలువైయున్నారు. శ్రీ జనార్ధనస్వామివారు ఈ ఆలయం వేయి సం॥రాల క్రితం నిర్మించింది.

**2. పాలకొల్లు :** నరసాపురానికి 8 కి.మీ దూరంలో ఉన్న ఈ ఊరు పాలచెట్లు ఎక్కువగా ఉండుటచే పాలకొల్లుగా పిలువబడుతుంది. ఇక్కడ కొలువైవుంది క్షీరారామేశ్వర క్షేత్రం. పంచారామలలో ఇది ఒకటి. శ్రీరామచంద్రుని ప్రతిష్ఠతమైనది ఈ శివలింగము. ఈ రాజగోపురం 120 అడుగుల ఎత్తు ఉంది. దీనిపై విగ్రహములు చాలా వున్నాయి. ఇదేకాక పాలకొల్లు వున్న మరో పురాతన దేవాలయంలోనే శ్రీ అష్టభుజ లక్ష్మీనారాయణస్వామి వారి ఎనిమిది చేతులు కలిగిన ఈ లక్ష్మీనారాయణ విగ్రహం అతిసుందరమైనది. ఇంకా శ్రీ పాండురంగస్వామి ఆలయం, శ్రీ సీతారామస్వామి ఆలయం, మావుళ్ళమ్మగుడి చూడాల్సిన క్షేత్రాలు. రామలింగేశ్వరస్వామి కూడ కలదు. పాలకొల్లులోనే కాలువ ఒడ్డున శ్రీసాయిబాబా దేవాలయం ప్రఖ్యాతి గాంచినది. ప్రతి గురువారం వేలాది భక్తులకు అన్నదానం నిర్వహించబడును. ఇచ్చటనే వున్న "ఓం శ్రీ సాయిరాం" నామ కోటి స్థూపమునకు అనేక మంది భక్తులు ప్రదక్షిణలు చేసి సత్ఫలితములు పొందుచున్నారు.

**3. ఆచంట :**పాలకొల్లుకి 8 కి.మీ. దూరంలో వున్న ఆచంటలో శ్రీ ఉమామహేశ్వర స్వామి కొలువైవున్నారు. ఇంకా పాలంకృత రామలింగేశ్వర స్వామి

ఆలయం, ఇంకా శ్రీ మదనగోపాల స్వామివారి ఆలయం కూడా పురాతనమైనదే గాక దర్శించదగ్గ ఆలయాలు.

**4. రుస్తుంబాద్ :** సంచార నర్సాపురానికి 2 కి.మీ. దూరంలో వున్న రుస్తుంబాద్‌లో కొలువై వున్నారు. శ్రీ పార్వతీసహిత శ్రీ విశ్వేశ్వరస్వామి వారు ఇదే గ్రామంలో వైష్ణవ ఆలయంలో శ్రీ జగన్నాధస్వామి బలభద్రుడు సుభద్రలు కొలువైవున్నారు. శ్రీ మూలవిరాట్ పూరీలోని జగన్నాధుడు మాదిరిగా వుంటాయి.

**5. నరసాపురం :** నర్సాపురం పట్టణంలో శ్రీ లక్ష్మీరాధా, రుక్మిణి, సత్యభామా సమేతులై, చతుర్భుజులై శంఖ చక్రధారియై వేణువు మత్స్య, కూర్మాది శుభలక్షణయుతులైన శ్రీరాజగోపాలస్వామి కొలువై వున్నారు.

**6. ద్వారకా తిరుమల :** ఏలూరుకు 40 కి.మి, భీమడోలుకి 4 కి.మి దూరంలో వున్న ద్వారక తిరుమలలో కొండపైన వేంకటేశ్వరస్వామి దేవస్థానం చాలా ప్రాముఖ్యత గల పుణ్య క్షేత్రము. దీనినే "చిన్నతిరుపతి" అంటారు. శనివారం రోజున ఎక్కువ మంది వస్తారు. తిరుపతి వెళ్ళి మ్రొక్కులు తీర్చలేని, ఆర్థికస్తోమతలేనివారు ద్వారకా తిరుమల వెళ్ళి తీర్చిన చాలును. ఇది అనాదిగా వస్తున్న ఆచారం.

**7. నరసాపురం :** నరసాపురం పట్టణంలో వేంచేసియున్న శ్రీ మదన గోపాలస్వామి వారి దేవాలయం ఒక విశిష్టతను సంతరించుకున్న ఆలయం.

**8. లక్షణేశ్వరం :** నరసాపురానికి 9 కి.మీ దూరంలో వున్న పుణ్యక్షేత్రం లక్షణేశ్వరం, ఇక్కడి స్వామివారికి కొప్పువున్నది. గనుక ఆయనకి కొప్పు లింగేశ్వరుడు అని అంటారు. ఇక్కడి స్వామివారికి రోకలిపోటు, కోడికూత వినపడకూడదని అంటారు. లక్ష్మణునిచే ప్రతిష్ఠింపబడిన శ్రీదుర్గా లక్ష్మీ గణేశ్వరస్వామిఆలయం ఉంది. ఈ స్వామిమూర్తికి కొప్పు ఉంటుంది. సమీపములో ఇళ్ళులేవు.

**9. నరసింహపురం :** ఉండి గ్రామనికి 2 కి.మీ. దూరంలో ఉన్న ఈ గ్రామంలో కొలువై వున్న స్వామివారి ఆలయంలో వందల సంఖ్యలో వివాహాలు జరుగుతాయి.

**10. జుత్తిగ :**తణుకు నుండి 11 కి.మీ. దూరంలో జుత్తిగలో నున్న ఘృష్ణేశ్వర జ్యోతిర్లింగ మహాక్షేత్రమని పిలుస్తారు. ఇక్కడ పార్వతీదేవి, శ్రీ దుర్గాదేవి, మరియు అవిసిరమ్మ శారదాదేవి దర్శనమిస్తారు. శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరస్వామి దర్శనమిస్తారు.

ఇక్కడ  శ్రీ లక్ష్మీజనార్ధనుడు, ఆ ప్రక్కనే ఆంజనేయస్వామి వున్నారు. ఇక్కడ నవగ్రహాలు, శ్రీ సూర్యనారాయణ కూడా కొలువై వున్నారు. ఈ క్షేత్రానికి పాలకుడు శ్రీకాల భైరవమూర్తి వున్నాడు. శివదర్శనానికి ముందు ఆయనని దర్శించి అనుమతి తీసుకొవాలి. దర్శన అనంతరం శ్రీకాలభైరవుని దర్శించి గుడి నుంచి వెళ్ళటానికి అనుమతి కోరుకోవాలి. అక్కడ నుండి అగ్నేయములో గణపతి అక్కడే ఓ మూల ద్యుతికాదేవి వున్నారు.

ఈ గుడిలో ప్రత్యేక పూజ "మృత్యుంజయకల్పం" ఈ పూజ చాలా కఠినమైనది. ఎవరైన కష్టాలలో వున్నప్పుడు కోర్టు వ్యవహారాల్లో ఇంకా క్లిష్టతరమైన వ్యవహారాల్లో



వున్నప్పుడు ఈ మృత్యుంజయ అభిషేకం చేసుకుంటామని మొక్కుకుంటే తప్పనిసరిగా ఆ కోరిక నెరవేరుతుంది. ఉరిశిక్షపడ్డ వాళ్ళకి ఇక్కడ మొక్కు కున్నాక అది రద్దు అవడం, ఏడు అంతస్థులపై నుండి క్రింద పడికూడా బ్రతకడం ఈ మృత్యుంజయకల్పం" విశేషం అని  చెబుతున్నారు.

**11. మల్లెపూడి :** జుత్తిగకి కిలో మీటరు దూరంలో మల్లెపూడి గ్రామంలో మల్లెతోటలో గోపీనాధుడు అనే పేరుతో ఈ మదన గోపాలస్వామి విగ్రహాన్ని ప్రతిష్ఠించి ఆలయం కట్టించారు.

**12. సత్తారామేశ్వరం :** గోస్తనీ నదితీరములో వున్న పుణ్యక్షేత్రముల్లో నత్తారామేశ్వరము అతిప్రాచీనమైనది. పరశురామునిచే ప్రతిష్ఠ చేయబడిన నత్తారామేశ్వరములో శ్రీ రామలింగేశ్వరస్వామి గోస్తనీ నది జలములోనే వుంటాడు. వేసవిలో ఒక నెల మాత్రం ఆయనను దర్శించవచ్చు. దీనినే "సప్త కోటీశ్వర లింగం" అని కూడా అంటారు.

**13. నత్తారామేశ్వరం :** రావణ వధానంతరం వేరొక ఈశ్వర లింగమును సీతాదేవి కోరికమీద ప్రతిష్ఠించదలచాడు. ఈప్రదేశములో ప్రతిష్ఠచేయటానికి ఒక బాణమును తెమ్మని శ్రీ రాముడు హనుమంతుని పంపాడు. ఆంజనేయుడు దాన్ని తేవడంలో కొంచెం ఆలస్యమయింది. నిర్ణయించబడిన మూహర్తమునకే శివలింగ ప్రతిష్ఠచేయాలని జానకీదేవి నత్తలను, ఇసుకను ప్రోగుచేసి లింగముగా తయారుచేసింది. సీతాదేవి కోరిక మేరకు ఆలింగమునే ప్రతిష్ఠ చేశాడు. శ్రీరాముడు అదే రామేశ్వరలింగం నత్తలతో కూడివున్నది. కనుక నత్తారావేశ్వర లింగమై ఈ ఊరిపేరే నత్తారామేశ్వరమయింది.

**14. బల్లిపాడు:** భీమవరం రైల్వే లైనులో అత్తిలి స్టేషన్‌లోదిగితే అక్కడ నుండి అర కిలోమీటరు దూరంలో వుంది బల్లిపాడు గ్రామం. శ్రీ మదన గోపాలస్వామి వారి దేవస్థానం ఈ గ్రామంలో వుంది.

**15. మండపాక:** తణుకుకి సుమారు 5 కి॥మీ॥దూరంలో వుంది మండపాక గ్రామం. ఈ గ్రామంలోనున్న పురాతన ఆలయాల్లో శ్రీ కేశవస్వామి విగ్రహం బహుసుందరమైనది. సోమేశ్వర ఆలయం, మరియు ఎల్లారమ్మ దేవాలయాలు చూడదగినవి.

**16. పాలంగి :**తణుకుకి 5 కి॥మీ॥ దూరంలో ఉండ్రాజవరం మండలంలో వున్న గ్రామం పాలంగి. తణుకు నుండి బస్సు సౌకర్యం వుంది  ఇక్కడ శ్రీ బాలా త్రిపురసుందరీ సమేత రామలింగేశ్వరస్వామి కొలువై యున్నారు. భక్తులు నీటిలో వున్న శ్రీరామలింగేశ్వర స్వామిని దర్శించి తమ మొక్కులు తీర్చమని కోరుకుంటారు.

**17. ఉండ్రాజవరం :**శ్రీ దేవి భూదేవి సమేత శ్రీ కేశవస్వామి స్వయంభువు. ఈ గుడిని అనుకునివున్నది. శ్రీగోకర్ణేశ్వరస్వామి వారి ఆలయం. దేవాలయానికి వెనుకవైపు రెండు ఫర్లాంగులు దూరంలో గోస్తకీనది ఒడ్డున వుంది శ్రీసుబ్రహ్మణ్యేశ్వర స్వామివారి ఆలయం.

**18. నిడదవోలు :** శ్రీ గోవిందేశ్వరస్వామి మహిమాన్వితుడు. చూడదగ్గ ఆలయం ఇంకా నిడదవోలు శ్రీ సత్యనారాయణస్వామి, శ్రీ సోమేశ్వరస్వామి, శ్రీ రాజశేఖరస్వామి, శ్రీ మదనగోపాలస్వామి, శ్రీ ఆంజనేయ స్వామి, కోటసత్తెమ్మ ఆలయం, శ్రీ శివాలయం, శ్రీ సుబ్రహ్మణేశ్వరస్వామి శ్రీ విఘ్నేశ్వర స్వామి ఆలయములు, శ్రీసాయిబాబా మందిరం కూడా వున్నాయి.

**19. కొవ్వూరు :**రాజమండ్రికి 7 కి.మీ దూరంలో గల ఈ గోష్పాదక్షేత్రంలో గౌతమ మహర్షి ప్రతిష్ఠించిన వరదగోపాల స్వామిని దర్శించవచ్చు. శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర స్వామి, శ్రీ గౌతమేశ్వర స్వామి, శ్రీ బాలాత్రిపుర సుందరేశ్వర స్వామి, శ్రీ సాయిబాబా ఆలయం, శ్రీ చైతన్య రాధాకృష్ణ, ఆంజనేయస్వామి, గ్రామదేవత కొవ్వూరమ్మ ఇతర ఆలయములు.

**20. కుమారదేవం :** కొవ్వూరుకి 8 కి॥మీ॥ దూరంలో గోదావరి ఒడ్డున ప్రయాణిస్తే తగులుతుంది. ఈ కుమారదేవ గ్రామం. ఈ గ్రామంలో స్వయంభువుడుగా వెలసిన స్వామివారు. ఇదే ఆవరణలో శ్రీ వేంకటేశ్వర స్వామి వారి ఆలయం కూడా నిర్మించారు.

**21. తాళ్ళపూడి :**కొవ్వూరు నుండి గోదావరి ఒడ్డునే వున్న రోడ్డు మీద ఎగువకు ఇరవైనాలుగు కిలోమీటర్లు దూరంలో ప్రయాణిస్తే ఒడ్డునే తగుల్తుంది తాళ్ళపూడి గ్రామం. ఈ గ్రామములో కొలువై ఉన్నారు. శ్రీ మదనగోపాలస్వామి వారు. స్వామివారు మహామహిమాన్వితులు.

**22. గూటాల :**కొవ్వూరు నుంచి గోదావరి ఒడ్డునే వున్న రోడ్డు మీద ప్రయాణిస్తే కొవ్వూరుకి 27 కి॥మీ॥ దూరం అనంతరం తగులుతుంది గూటాల గ్రామం. ఇక్కడ వున్న అతి ప్రాచీనమైన గుడి శ్రీ ప్రసన్న ఆంజనేయస్వామి వారి ఆలయం. నూతనంగా శ్రీ ప్రసన్న ఆంజనేయస్వామి ఆలయం నిర్మించారు. ఇక్కడ శ్రీ లక్ష్మీ నరసింహస్వామి వారి ఆలయం వున్నది. ఆ దివ్య స్థలంలో ఏడు శ్రీరామాలయాలు, గ్రామ దేవత ముత్యాలమ్మ ఆలయములు కూడా వున్నాయి.

**23. పట్టిసీమ :**రాజమండ్రికి 35 కి.మీ., కొవ్వూరుకి 15 కి.మీ దూరంలో నది మధ్యలో వున్న ఈ పట్టిసీమ క్షేత్రం అతి దివ్యమయింది. భారతదేశంలో పంచకాశి క్షేత్రములలో ఇదొకటి. భద్రగిరి వీర భద్రేశ్వరుని కొండ పట్టిసీమకు ఆరున్నర కి.మీ. దూరంలో మహానందీశ్వరుని ఆలయం ఉంది.

**24. కైకరం :**తాడేపల్లిగూడేనికి 16 కి.మీ. దూరంలో రోడ్డుకు ఆనుకుని ఉన్న గ్రామం కైకరం. పార్వతీ సహిత శ్రీ రామలింగేశ్వరస్వామి ఆలయం అతిపురాతనమైన దర్శనీయక్షేత్రం. ఆ ఆలయం ప్రక్కనే రుక్మిణీ సత్యభామ సహిత శ్రీ వేణుగోపాల స్వామి కొలువై ఉన్నారు. ఆ ఆలయంలోనే శ్రీ దేవి, భూదేవి సహిత రంగనాయక స్వామిని దర్శించవచ్చు.



**25. దువ్వ :**తణుకు నుంచి 7 కి.మీ. వున్న గ్రామం దువ్వ. ఈ గ్రామంలో వేణుగోపాలస్వామి దేవాలయం 300 సం॥ నిర్మించిన శ్రీ సీతారామస్వామి దేవాలయం ప్రసిద్ధిచెందినది. ఇవేకాక గ్రామదేవత శ్రీదానేశ్వరి అమ్మవారు అత్యంత శక్తివంతమైన మహిమలు గల దేవత తప్పక దర్శించగలరు.

**26. తేతలి:**తణుకుకు 3 కి.మీ. దూరంలో వున్న గ్రామం తేతలి గ్రామంలో శ్రీ రాజేశ్వరస్వామి మరియు శ్రీ సీతారామస్వామి ఆలయం అతిపురాతనమైనది.

**27. తణుకు :** ఉత్తరభాగంలో శ్రీ కేశవస్వామి ఆలయం ఉన్నాయి. వెయ్యేళ్ళ క్రితం నిర్మించబడిన శ్రీ సిద్ధేశ్వరస్వామి ఆలయం. శ్రీ ఆంజనేయస్వామి వారి ఆలయం, శ్రీ సీతారామస్వామి ఆలయం, ఈ మధ్య నిర్మించిన శ్రీ సూర్యనారాయణా మూర్తి ఆలయం గ్రామదేవతలు ముత్యాలమ్మ మహంకాళమ్మ దేవాలయాలు దర్శింపదగ్గవి.

**28. తీపర్రు :** నిడదవోలు – నరసాపురం బస్‌రూట్‌లో పెరవలి నుంచి నిడదవోలు వైపు ఆరున్నర కి॥మీ॥ ప్రయాణించేస్తే మెయిన్‌రోడ్‌కి అనుకుని వున్న గ్రామమే తీపర్రు ఈ గ్రామంలో రాజరాజ నరేంద్రస్వామి దేవాలయం ప్రసిద్ధిచెందినది. ఈ గ్రామంలోనే శ్రీ భమరాంబా, మల్లికార్జునస్వామి దేవాలయం, శ్రీ రామాలయం, శ్రీ ఆంజనేయస్వామివారి ఆలయం, గ్రామదేవత చింతాలమ్మ, మరియు పంచముఖి, సప్తముఖి, ఏకాదశి ముఖ, ఆంజనేయ విగ్రహములున్నాయి.

**29. ముక్కామల :** తణుకు నుంచి రావులపాలెం పోయేదారిలో పెరవలి మండలంలో ఉన్న గ్రామము ముక్కామల ఈ గ్రామంలో పురాతన ఆలయంలో శ్రీ సోమేశ్వరస్వామి, శ్రీ ఉమా పార్వతిదేవి సహితంగా కొలువై వున్నారు.

**30. ఖండవిల్లి :**ముక్కామల గ్రామం నుండి 3 కి.మీ. దూరంలో వున్న ఖండవిల్లి గ్రామంలో పంచలింగ క్షేత్రం వుండటం అరుదు. ఖండవిల్లి ఒకే ఆవరణలో మూడు వందల సంవత్సరాల క్రితం నిర్మించబడ్డ శ్రీ వేణుగోపాలస్వామి, శ్రీ ఆంజనేయస్వామి ఆలయాలున్నాయి. గ్రామదేవత శ్రీ పోలేరమ్మ జాతర చూడచక్కగా వుంటుంది.

**31. సిద్ధాంతం :** పెనుగొండలో 8 కి.మీ. దూరంలో వడికి మీదుగా ప్రయాణిస్తే వస్తుంది. సిద్ధాంతం గ్రామం ఈ గ్రామంలో అతి ప్రాచీనమైనది. శ్రీ కేదరేశ్వర దేవాలయం, ఇవేకాక శ్రీ విజయగోపాలస్వామి, శ్రీ నందేశ్వరస్వామి, శ్రీ సీతలింగేశ్వర స్వామి, శ్రీ విఘ్నేశ్వర స్వామివార్ల దేవాలయం చూడదగినది.

**32. మల్లేశ్వరం :** తణుకు 12 కి.మీ. దూరంలో వశిష్ఠ గోదావరి తీరాన గల క్షేత్రములో శ్రీ కపిలమల్లేశ్వరస్వామి ఆలయం చాలా పురాతనమైనది, చాలా విశిష్టమైనది. గోదావరి పొంగినపుడు శ్రీ స్వామివారి గర్భాలయంలో పాతాళగంగ పైకి తన్నినట్లు నీరు వస్తుంది. గోదావరి తగ్గినపుడు ఆలయంలోని నీరు తోడనవసరం లేకుండానే గర్భాలయంలో శ్రీ స్వామివారి సన్నిధిలోనే అంతరించిపోతుంది.

**33. విజ్జేశ్వరం :** ఇచ్చట గల శ్రీ విజయలింగేశ్వర స్వామి ఆలయం దర్శించగలరు.

**34. వాడపల్లి :** ఇచ్చట గల అనంతభోగేశ్వరస్వామి ఆలయం చూడగలరు.

**35. ఆరికిరేవుల :** ఇచ్చట గల శ్రీ సోమేశ్వరస్వామి ఆలయం చూడగలరు.

**36. పోలవరం :**ఇచ్చట గల శ్రీ పాండురంగ స్వామి ఆలయం దర్శించగలరు.

**37. భీమడోలు :**ఇచ్చట గల దుర్గాదేవి ఆలయం చూడగలరు.

**38. భీమవరం :**ఇచ్చట గల జనార్ధనస్వామి ఆలయం గునుపూడిలో చూడగలరు. సోమేశ్వరస్వామి చంద్ర ప్రతిష్ఠ క్షేత్రపాలకుడు జనార్ధనస్వామి పంచారామములలో ఒకటి. మావుళ్ళమ్మ ఆలయం కలదు. మరియు భీమేశ్వరస్వామి ఆలయం చూడగలరు.

**39. సిద్ధాపురం :**ఇచ్చట గల శ్రీ రామచంద్రస్వామి ఆలయం దర్శించగలరు.

**40. నెగ్గిపూడి :**ఇచ్చట గల శ్రీ బాలనాగత్రిపుర సుందరీదేవి ఆలయం దర్శించగలరు

**41. ఏలూరు :** శనివారపుపేటలో వున్న చెన్నకేశవస్వామి వేంకటేశ్వరస్వామి ఆలయం చూడగలరు. తూర్పుదిశ యందు శివాలయము దర్శించగలరు.

**42. పెదవేగి :** వేంగి రాజుల నిర్మించబడిన పరమేశ్వరాలయము చాలా పురాతనమైనది.

**43. గునుపూడి :** భీమవరంకు దగ్గరలో నున్న గునుపూడిలో చంద్ర ప్రతిష్ఠిత మయిన సోమేశ్వర స్వామి ఆలయము పంచారామములలో ఒకటి. ఇచ్చట గల పంచ నందులు కలవు. క్షేత్రపాలకుడు జనార్ధన స్వామి ఆలయము దర్శించదగినది.

**44. వీరవాసరం :**శ్రీ సీతారామస్వామి, శ్రీ వేణుగోపాలస్వామి ఆలయములు కలవు. ప్రతి ఒక్కరూ చూడదగినవి.

**45. పట్టస :** ఈ గ్రామ సమీపములో గోదావరీ నదీ మధ్యన లంకలో భావనారాయణస్వామి ఆలయం కలదు. చాలా ప్రాచీన ఆలయము.

**46. లక్ష్మీపురం :** ఏలూరుకు దగ్గరలో నున్న లక్ష్మీపురం "వరలక్ష్మి" అను శ్రీసాయికోటి స్థూపం సాయిభక్తులు ప్రతి ఒక్కరు దర్శించదగినది. భక్తులు కోటిస్థూపంకు ప్రదక్షిణలు చేయటం విశేషం.





## 6. కృష్ణా జిల్లా

| | | |
|---|---|---|
| **1. వైశాల్యం** | : | 8,727 చ.కి.మీ. |
| **2. జనాభా** | : | 48,00,000 |
| **3. అక్షరాస్యత** | : | 65% |
| **4. మండలాలు** | : | 49 |
| **5. నదులు** | : | కృష్ణనది ప్రధాన జీవనది. వాగులు, ఏరులు కొన్ని |
| **6. అడవులు** | : | అతి తక్కువ. (కేవలం 663 చ.కి.మీ.) |
| **7. పంటలు** | : | మామిడి, చెఱకు, పొగాకు, వరి, వేరుశెనగ |
| **8. ఖనిజాలు** | : | క్రోమైట్, బెరైటీస్, సహజవాయువులు, మైకా |
| **9. పరిశ్రమలు** | : | సిమెంట్ ఫ్యాక్టరీలు, పంచదార, జౌళిపరిశ్రమలు, ఎలక్ట్రానిక్స్, ఉత్పాదక పరిశ్రమలు. |

**10. విజయవాడ నుండి ఈ జిల్లాలోని వివిధ ప్రాంతాలకు గల దూరం (సుమారుగా కి.మీ.లలో) :**

| పట్టణం/నగరం | దూరం | పట్టణం/నగరం | దూరం |
|---|---|---|---|
| మచిలీపట్నం | 75 | అవనిగడ్డ | 85 |
| గుడివాడ | 55 | నూజివీడు | 50 |
| పామర్రు | 45 | జగ్గయ్యపేట | 80 |
| హనుమాన్ జంక్షన్ | 50 | | |

**11. సరిహద్దులు :** తూర్పు - బంగాళాఖాతం, ప॥గో॥ జిల్లా.
పశ్చిమ - గుంటూరు జిల్లా
ఉత్తరం - ఖమ్మం జిల్లా
దక్షిణం - బంగాళాఖాతం

**12. ముఖ్యకేంద్రం :** మచిలీపట్నం

**13. రైల్వేస్టేషన్ :** విజయవాడ

**14. ప్రధాన పట్టణాలు :** మచిలీపట్నం, విజయవాడ, గుడివాడ, నూజివీడు, జగ్గయ్యపేట, ఉయ్యూరు, తిరువూరు, అవనిగడ్డ, నిడుమోలు, కైకలూరు

**15. మండలాలు (49) :**1. మచిలీపట్నం 2. గూడూరు 3. పెడన 4. కృత్తివెన్ను 5. బంటుమిల్లి 6. అవనిగడ్డ 7. నాగాయలంక 8. కోడూరు 9. మొవ్వ 10. చల్లపల్లి 11. ఘంటశాల 12. గుడివాడ 13. ముదినేపల్లి 14. మోటూరు 15. గుడ్లవల్లేరు 16. పామర్రు 17. మండవల్లి 18. కైకలూరు 19. కలిదిండి 20. వెదపారుపూడి 21. విజయవాడ గ్రామీణ 22. పెనమలూరు 23. కంకిపాడు 24. మైలవరం 25. ఇబ్రహీంపట్నం 26. జి. కొండూరు 27. కంచికచర్ల 28. వీరుళ్ళపాడు 29. నందిగామ 30. పెనుగంచిప్రోలు 31. చందర్లపాడు 32. జగ్గయ్యపేట 33.

వత్సవాయి 34. నూజివీడు 35. ఆగిరిపల్లి 36. ముసునూరు 37. బావులపాడు 38. గన్నవరం 39. ఉంగటూరు 40. పమిడి ముక్కల 42. తోట్లవల్లూరు 43. విస్సన్నపేట 44. చాట్రాయి 45. రెడ్డిగూడెం 46. కొండూరు 47. తిరువూరు 48. గంపలగూడెం 49. మోపిదేవి.

**16.జిల్లా చరిత్ర :**చారిత్రక ప్రసిద్ధమైన కృష్ణా జిల్లాపై మౌర్యుల కాలం నుంచి బౌద్ధమత ప్రభావం గణనీయంగా పడింది. కృష్ణా జిల్లా తూర్పు ప్రాంతంలో ఘంటశాల, పడమటి వైపు కృష్ణానదీ తీరంలో విజయవాడ, అమరావతి, బౌద్ధమత ఆరామాలకు ప్రసిద్ధి గాంచింది. శాతవాహనుల కాలం నుంచే పుణ్యస్థలంగా పేరొందిన ఈ ప్రాంతంలో మౌర్యుల కాలంలో నిర్మించిన మహా స్తూపం బయల్పడింది. బందరు రేవుగా పేరొందిన మచిలీపట్నం ఈస్టిండియా కాలం నుంచి ప్రధాన రేవు ప్రాంతంగా వాసికెక్కింది. చరిత్రాత్మకమైన కృష్ణానది, కొల్లేరు సరస్సు ఉన్న ఈ జిల్లా రాష్ట్రంలో వ్యవసాయ వాణిజ్య కార్యకలాపాలలో ముఖ్యమైన ప్రదేశం.

## కృష్ణా జిల్లాలోని దర్శనీయ స్థలాలు



**1.ఎనమలకుదురు :** ఎనమలకుదురు గ్రామములో చిన్న గుట్టలాంటి కొండమీద స్వయంభువుయై వెలిశారు. శ్రీ రామలింగేశ్వర స్వామివారి ఆలయం అతి పురాతనమైనది. ఇక్కడే వెలిసిన వినాయకుడిని కూడ దర్శించగలరు.

**2.జగ్గయ్యపేట :**శ్రీధన శైల శ్రీ సీతారాములవారి దేవాలయం అతి పురాతన క్షేత్రం. ఇక్కడ స్వామివారి ఉత్తర దిశలో వెలసి వుండుట ఈ ఆలయ ప్రత్యేకత. చంద్ర మౌళేశ్వరస్వామి ఆలయం కూడ ఉన్నది. మరియు రంగనాయకస్వామి ఆలయం కలదు.

**3.జగ్గయ్యపేట:** ఇది పురాతన చంద్రమల్లేశ్వరస్వామివారి ప్రసిద్ధి దేవాలయం. ఆలయ ప్రాంగణంలో ద్వాదశ జ్యోతిర్లింగాలు, అయ్యప్ప స్వామి, శ్రీకుమారస్వామి, శ్రీ దత్తాత్రేయస్వామి, శ్రీసుబ్రహ్మణ్యస్వామి, నవగ్రహాలు కొలువై ఉన్నాయి. ఇంకా శ్రీ కన్యకాపరమేశ్వరీ ఆలయం శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయం తప్పనిసరిగా దర్శించవలసిన క్షేత్రాలు.

**4. ముక్త్యాల:** జగ్గయ్యపేట నుండి (ముక్త్యాల) లేక ముక్తేశ్వరం 13 కి.మీ. దూరంలో ఉంది. ముక్తేశ్వరస్వామి అతిప్రాచీన శైవక్షేత్రం. జగ్గయ్యపేట మండలంలో వున్న వున్న ఈ ముక్తేశ్వర క్షేత్రం దర్శనీయ పుణ్యక్షేత్రం.

**5. వేదాద్రి :** జగ్గయ్యపేట నుండి 18 కి.మీ. దూరంలో వున్న దివ్యక్షేత్రం వేదాద్రి. యోగనందలక్ష్మీనరసింహస్వామి ఆలయం. భక్తులు నిద్ర చేస్తారు. గుంటూరు జిల్లా వాసులు పడవలో చేరతారు.

**6. తిరుమలగిరి :** జగ్గయ్యపేట మండలములో వున్న తిరుమల గిరిలో శ్రీ వేంకటేశ్వరస్వామివారి శ్రీదేవి, భూదేవి సమేతంగా కొలువై వున్నారు. కొండమీద



మల్లేశ్వరస్వామి గుడిని చూడగలరు. హైవేమీద చల్లకల్లు సెంటరు నుండి 2 కి.మీ. దూరములో వున్నది.

**7. నెమలి :** కంచికచల్ల నుండి మధిర చేరుకొని అచ్చట నుండి నెమలి చెరుకోవచ్చు. సుమారు 80 కి.మీ. దూరం వుంటుంది. విజయవాడ నుండి నెమలికి బస్సు వున్నది. కృష్ణాజిల్లాలోని గంపలగూడెం మండలంలోని నెమలిలో శ్రీవేణుగోపాల స్వామి స్వయం వ్యక్తమూర్తి, దర్శనీయ దేవాలయం.

**8. పెనుగంచిప్రోలు :** నందిగామ నుండి 16 కి.మీ. దూరంలో మరియు చల్లకల్లు సెంటరు నుండి 10 కి.మీ. దూరములోను పెనుగంచిప్రోలు గ్రామంలో శ్రీ గోపయ్యస్వామి సమేత శ్రీ లక్ష్మీతిరుపతమ్మ అమ్మవారు, శ్రీ తిరుపతమ్మవారు కొలువై వున్నది. ప్రతి ఒక్కరు దర్శించ వలసిన పుణ్యక్షేత్రం. శంభు లింగేశ్వర ఆలయం కూడ చూడదగనది. లక్ష్మీ నరసింహస్వామి ఆలయం వున్నది.

**9. ఆగిరిపల్లి :** విజయవాడ నుండి 10 కి.మీ. దూరంలో వున్న ఆగిరిపల్లి క్షేత్రంలో వెలసివున్నారు. శ్రీ శోభనాచల వ్యాఘ్రనృసింహస్వామి స్వయంభువు. అత్యంత మహిమ గలవారు. ప్రతి ఒక్కరూ దర్శించుకో వలసిన నృసింహ క్షేత్రం ఈ అగిరిపల్లి.

**10. మంటాడ :** ఉయ్యూరు నుండి 6 కి.మీ. దూరంలో వున్న మంటాడ గ్రామంలో ఒకే ప్రాంగణంలో ఇద్దరు వేంకటేశ్వరస్వాములు కొలువై ఉండటం విశేషం. పెళ్లికానివారు దర్శిస్తే పెళ్ళి ఖచ్చితముగా అవుతుంది అని ప్రతీతి.

**11. కపిలేశ్వరపురం :** మంటాడ జాతీయ రహదారికి 5 కి.మీ. దూరంలో పమిడి ముక్కల మండలంలో కపిలేశ్వరపుర గ్రామంలో శ్రీ రఘు నాయక ఆంజనేయ మరియు అగస్త్యేశ్వరాలయం అతి పురాతన మైనది.

**12.ఐలూరు :** మేడూరుకి 10 కి.మీ. దూరంలో ఐలూరు గ్రామంలో శ్రీ రామలింగేశ్వరస్వామి దేవాలయం అత్యంత పురాతనమైనది. శ్రీ సీతా సమేత రఘునాయకస్వామి ఆలయం కూడా మహిమాన్వితమైన దేవాలయం.

**13.శ్రీరంగపురం :**పమిడిముక్కల మండలంలో ఐలూరు 6 కి.మీ. దూరంలో వున్న పవిత్ర పుణ్యక్షేత్రం శ్రీరంగపురం. ఆ ప్రక్కనే జంబుకేశ్వరస్వామివారి ఆలయం దర్శనీయక్షేత్రం.

**14.శ్రీకాకుళం :** శ్రీ రంగపురం నుండి 8 కి.మీ. దూరంలో, ఘంటసాల మండలంలో వున్న గ్రామం శ్రీకాకుళం. చల్లపల్లికి 15 కి.మీ. దూరంలో కలదు. అతి ప్రాచీనమైన శ్రీకాకుళేశ్వరస్వామి దేవాలయం కలదు. మరియు శ్రీ ఏకరాత్రి ప్రసన్న మల్లికార్జున స్వామివారి ఆలయంకూడా కొన్ని శతాబ్దాల, చరిత్ర కలిగిన దేవాలయం.

**15.మొవ్వ :**చల్లపల్లికి 8 కి.మీ. దూరంలో మొవ్వ మండల కేంద్రంలో మువ్వ వేణుగోపాలస్వామి దివ్యక్షేత్రంగా పేరుపొందింది. మరియు ఆ ప్రక్కనే వున్న పురాతనమైన శ్రీ బాలాత్రిపురసుందరీ సమేత శ్రీ భీమేశ్వర స్వామివారి ఆలయం కలదు.

**16. పెద్దకళ్ళేపల్లి :** మొవ్వ నుండి 16 కి.మీ. దూరంలో వున్న పెద్దకళ్ళేపల్లిలోని పుణ్యక్షేత్రం. శ్రీ దుర్గాపార్వతీసమేత నాగేశ్వరస్వామివారి ఆలయం తప్పక దర్శించ వలసిన పుణ్యస్థలము.

**17. మోపిదేవి :** పెద్దకళ్ళేపల్లి నుండి 8 కి.మీ. దూరములో వున్నది. ఇక్కడ శ్రీ వల్లీ, దేవసేన సమేత శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర స్వామివారి కొలువై వున్నారు. ఆ ప్రక్కనే సకలేశ్వరస్వామి ఆలయము కూడా కలదు.

**18. ఘంటసాల :** చల్లపల్లికి 5 కి.మీ. దూరములో వున్న గ్రామము. ఇక్కడ శ్రీ జలధేశ్వరస్వామి, బాల సరస్వతీ సమేతముగా కొలువై వున్నారు. ఇదే గ్రామములో దర్శించదగిన విశ్వేశ్వరస్వామి ఆలయములో స్వామి మహిమలు అద్భుతమని స్థానికులు చెపుతున్నారు.

**19. హంసలదీవి :** మోపిదేవినుండి 28 కి.మీ. దూరములో హంసలదీవి వున్నది. ఇక్కడ శ్రీ రుక్మిణీ, సత్యభామా సమేత శ్రీ వేణుగోపాలస్వామి కొలువై వున్నారు. మన రాష్ట్రంలో 612 కి.మీ. ప్రయాణించిన కృష్ణానది ఇక్కడే సముద్రంలో సంగమిస్తుంది. దీనినే "కృష్ణాసాగర సంగమ క్షేత్రం" అంటారు.

**20. భావదేవరపల్లి :** కోడూరునుండి సుమారు 15 కి.మీ. దూరములో నాగాయలంక మండలములో వున్న గ్రామం భావదేవరపల్లి. ఇక్కడ వైష్ణవ దేవుడైన శ్రీ భావన్నారాయణస్వామి కొలువై వున్నారు.

**21. సంగమేశ్వరం :** భావదేవరపల్లి నుండి 10 కి.మీ. దూరంలో ఎదురయ్యే దివ్య ప్రదేశము సంగమేశ్వర స్వామి దేవాలయం చూడగలరు.

**22. చిలకలపూడి :** "కీరపండరీపురం", పాండురంగస్వామి దేవాలయం. దీనినే "శ్రీ కీర పండరీ క్షేత్రం" అని అంటారు. మచిలీపట్నం ప్రతి ఒక్కరు దర్శించదగినవి. శ్రీ స్వామి వారు స్వయంభువు.

**23. విజయవాడ :** ఇంద్రకీలాద్రి కొండమీద శ్రీ కనక దుర్గాదేవి, మల్లికార్జునస్వామి దేవాలయములు అత్యంత ప్రాముఖ్యత కలిగిన ఆలయములు.

**24. బేతవోలు :** బేతవోలు గ్రామములో ఆనందేశ్వరస్వామి దేవాలయము దర్శించగలరు.

**25. తోటవల్లూరు :** ఇచ్చట గల శ్రీ మల్లికార్జున స్వామి దేవాలయం చూడగలరు.

**26. లింగాలపాడు :** లింగాల పాడు గ్రామములోని శ్రీ లక్ష్మమ్మ దేవాలయం (నందిగామ మండలం) దర్శించగలరు.

**27. అవనిగడ్డ :** అవనిగడ్డలోని శ్రీ లక్ష్మినారాయణ స్వామి దేవాలయం తప్పక దర్శించగలరు. మరియు రాజశేఖరస్వామి దేవాలయం చూడగలరు.

**28. మచిలీపట్నం :** నవరాత్రి పర్వదినములలో మహిషాసురమర్దనీ దేవాలయం చూడగలరు. మరియు నాగేశ్వరస్వామి దేవాలయం దర్శించగలరు. మరియు శివగంగాలయం దర్శించదగినవి. ఇక్కడ పీఠం మీద అయ్యవారు అమ్మవారు కనిపిస్తారు.



**29. చిక్కవరం :** గన్నవరం మండలం బ్రహ్మ లింగేశ్వరస్వామి దేవాలయం దర్శించగలరు.

**30. చోడవరం :** విజయవాడ నుండి 10 కి.మీ. నాగేంద్రస్వామి దేవాలయం దర్శించగలరు.

**31. సుబ్బాయిగూడెం :** కృష్ణాజిల్లాలోని సుబ్బాయిగూడెంలోని భావనారాయణ స్వామి దేవాలయమును దర్శించగలరు.

**32. మండవల్లి :** కృష్ణాజిల్లా మండవల్లిలోని నాగసుబ్రహ్మణ్యస్వామి వారి దేవాలయం దర్శించగలరు.

**33. చేవూరుపాలెం :** కృష్ణాజాల్లాలోని శింగరాయ పాలెం సెంటర్, చేవూరుపాలెంలోని సుబ్రహ్మణ్యేశ్వర స్వామి దేవాలయం దర్శించగలరు.

**34. గుణదల :** 1925 సం॥ మేరీమాత విగ్రహాన్ని ప్రతిష్ఠించినారు. కొండక్రింద సెయింట్ మేరీస్ చర్చ్ అని అంటారు.

**35. గాంధీహిల్ :** ఇచ్చట గాంధీమెమోరియల్ లైబ్రరీ, ప్లానిటోరియం కలవు.

**36. విక్టోరియా మ్యూజియం :** పురావస్తు శాఖా వారిచే నిర్వహించబడే ఈ మ్యూజియం అందరూ చూడదగినది.

**37. ప్రకాశం బ్యారేజీ :** కృష్ణానదిపైన నిర్మించినారు. క్రొత్తగా కనక దుర్గ వారధి నిర్మించినారు. చూడదగినది.

**38. భవానీ ద్వీపం :** కృష్ణానదిలో 133 ఎకరాల వున్న ద్వీపాన్ని పర్యాటక స్థలము.

**39. మొగల్రాజపురం గుహలు :** ఈ గుహల 5 శతాబ్దంలోనివి నటరాజ, వినాయక, అర్ధనారీశ్వర విగ్రహాలు వున్నాయి. మరియు శంభులింగేశ్వర స్వామి దేవాలయము చూడగలరు.

**40. కొండపల్లి :** ఇక్కడ కోట 7వ శతాబ్దానికి చెందినది. ఇక్కడ బొమ్మలు ప్రపంచ ప్రఖ్యాతి గాంచినవి.

**41. కూచిపూడి :** విజయవాడకు 60 కి.మీ కూచిపూడి నృత్యం సృష్టికర్త సిద్ధేంద్రయోగి జన్మించినారు.

**42. వీరులపాడు :** ఈ గ్రామములో రామలింగేశ్వర ఆలయం చాలా ప్రసిద్ధి చెందినది. ఇచ్చట నల్లరాతి నంది విగ్రహము ఆకర్షణీయముగా కనిపించును.

**43. పెదముక్తేవి :** ఇచ్చట వేదవ్యాస నిర్మిత రాజ్యలక్ష్మీ సమేత లక్ష్మీనారాయణ దేవాలయము దర్శించగలరు. మరియు వైకుంఠనాథ స్వామి దేవాలయము కూడా దర్శించగలరు.

**44. మచిలీపట్నం :** మచిలీపట్నంకు దక్షిణ దిశలో శ్రీనగరిపురి నందు శ్రీ విద్యా శంకరేశ్వర సహిత దుర్గాభవాని మహారాజ మహిషాసుర మర్ధని ఆలయము. ఈమెకు కుడిభాగమున చంద్రమౌళీశ్వర మరియు రామాలయము భక్తాంజనేయస్వామి వున్నారు.

**45.గుడివాడ :** గుడివాడలోని భీమేశ్వరస్వామి దేవాలయం శ్రీ సాయిబాబా దేవాలయం దర్శించగలరు మరియు పురాతన వేణుగోపాలస్వామి ఆలయం మరియు ఇటీవల నిర్మించిన కన్యకాపరమేశ్వరీ దేవాలయం చూడదగినవి.

**46.బలివే :** బలివేలోని రామలింగేశ్వరస్వామి దేవాలయం సోమవారం నాడు దర్శించగలరు. మసునూరు మండలంలోని తిమ్మిలేరు ఒడ్డున ఎలివే వున్నది. ఇచ్చట మృత్యుమల్లేశ్వరస్వామి ఆలయం చూడదగినది.

**47.కేతవరం :** కేతవరంలోని గౌతమేశ్వరస్వామి దేవాలయం సోమవారం ఉదయం దర్శించగలరు.

**48.మానికొండ :** మానికొండలోని మలికార్జునస్వామి దేవాలయం చూడగలరు.

**49.మేదూరు :** మేదూరులోని దుర్గా నాగేశ్వరస్వామి దేవాలయం దర్శించగలరు.

**50.జుజ్జూరు :** ఇచ్చట గల సోమేశ్వరస్వామి దేవాలయం దర్శించదగినవి.

**51.పామర్రు :** ఇచ్చట గల శివాలయమును శ్రీ సాయిబాబా దేవాలయమును తప్పక దర్శించగలరు.

**52.యనమలకుదురు :** ఇచట గుట్టమీద వెలసిన శ్రీ రామలింగేశ్వర స్వామిని మరియు శ్రీ విఘ్నేశ్వర ఆలయాన్ని చూడవచ్చు.

**53.కొల్లేటికోట :**కైకలూరు నుండి ఆకివీడు వెళ్ళే మార్గములో ఆలపాడు నుండి 4 కి.మీ బస్ ప్రయాణం ఉంటుంది. ఇచట జలదుర్గా సమేత పెద్దింటమ్మ వారి ఆలయం కలదు.

**54.పరిటాల :** కించికచర్ల మండలంలోని పరిటాల గ్రామంలోని శ్రీరామపాద క్షేత్రం హైదరాబాదు – విజయవాడ జాతీయ రహదారిలో ఉన్నది. ఇచ్చట ప్రపంచంలోని పెద్దదైన వీరహనుమాన్ విగ్రహం ఉన్నది.

**55.యనకలకుదురు :** కాళికాదేవీ ఆలయం, శివాలయం, అయ్యప్పస్వామి దేవాలయం ఉన్నవి.

**56.కానూరు :** రామాలయం, గణేశాలయం ఉన్నవి.

**57.కేతవరం :** గుడివాడ నుండి మచిలీపట్నం రోడ్డులో 21కి.మీ దూరములో గుడ్లవల్లేరు మండలంలో కేతవరం గ్రామంలో శ్రీదేవి భూదేవి సహిత చెన్నకేశవస్వామి దేవాలయం చూడదగినది.





## ౭. గుంటూరు జిల్లా

1. **వైశాల్యం** : 11,391 చ.కి.మీ.
2. **జనాభా** : 50,00,000
3. **అక్షరాస్యత** : 60%
4. **మండలాలు** : 57 (750 గ్రామాలు)
5. **నదులు** : కృష్ణానది, నాగులేరు, గుండ్లకమ్మ
6. **అడవులు** : కృష్ణాజిల్లా కంటె కొద్దిగా ఎక్కువ (1380 చ.కి.మీ.)
7. **పంటలు** : మిరప, పొగాకు, పత్తి, వేరుశనగ, వరి
8. **ఖనిజాలు** : రాగి, సున్నపురాయి, బంకమట్టి
9. **పరిశ్రమలు** : క్రిమి సంహారక మందుల తయారీ పరిశ్రమలు, సిమెంట్, పంచదార తదితర చిన్నపరిశ్రమలు, వ్యవసాయ, విత్తనోత్పత్తి, జౌళి మిల్లులు, స్పిన్నింగ్
10. **విజయవాడ నుండి ఈ జిల్లాలోని ముఖ్యప్రాంతాలకు గలదూరం (కి.మీ.లలో)**

| పట్టణం/నగరం | దూరం | పట్టణం/నగరం | దూరం |
|---|---|---|---|
| తెనాలి | 28 కి.మీ. | బాపట్ల | 55 కి.మీ. |
| రేపల్లె | 65 కి.మీ. | అమరావతి | 35 కి.మీ. |
| నరసరావుపేట | 50 కి.మీ. | పిడుగురాళ్ల | 75 కి.మీ. |
| వినుకొండ | 90 కి.మీ. | | |

11. **సరిహద్దులు** : తూర్పు – బంగాళాఖాతం,
పశ్చిమ – కృష్ణాప్రకాశం జిల్లాలు
ఉత్తరం – నల్గొండ జిల్లా
దక్షిణం – ప్రశాశం జిల్లా
12. **ముఖ్యకేంద్రం** : గుంటూరు పట్టణం
13. **రైల్వేస్టేషన్** : గుంటూరు

**14.ప్రధాన పట్టణాలు :** గుటూరు, తెనాలి, నరసరావుపేట, చిలకలూరిపేట, బాపట్ల, పొన్నూరు, రేపల్లె, మంగళగిరి, మాచర్ల, సత్తెనపల్లి, వినుకొండ.

**15.మండలాలు(57) :** 1. వెల్దుర్తి 2. మాచర్ల 3. దుర్గి 4. రెంటచింతల 5. కారంపూడి 6. గురజాల 7. దాచేపల్లి 8. మాచవరం 9. పిడుగురాళ్ల 10. ఈపూరు 11. బొల్లాపల్లి 12. వినుకొండ 13. నూజెండ్ల 14. శావల్యాపురం (కనమర్లపూడి శివారు) 15. రొంపిచెర్ల 16. నకరికల్లు 17. నరసరావుపేట 18. చిలకలూరిపేట 19. నాదెండ్ల 20. యడ్లపాడు 21. బెల్లంకొండ 22. రాజుపాలెం 23. క్రోసూరు 24. ముపాళ్ళ 25. అచ్చంపేట 26. పెదకూరపాడు 27. సత్తెనపల్లి 28. ఫిరంగిపురం

29. మేడికొండూరు 30. గుంటూరు (రూరల్) 31. పెదకాకాని 32. ప్రత్తిపాడు 33. వట్టిచెరుకూరు 34. మంగళగిరి 35. తాడేపల్లి 36. తుళ్లూరు 37. తాడికొండ 38. అమరావతి 39. దుగ్గిరాల 40. తెనాలి 41. వేమూరు 42. అమర్తలూరు 43. కొల్లిపర 44. చుండూరు 45. చేబ్రోలు 46. కొల్లూరు 47. పొన్నూరు 48. పెదనందిపాడు 49. కాకుమాను 50. బాపట్ల 51. పిట్టలవానిపాలెం 52. కర్లపాలెం 53. నగరం 54. నిజాంపట్నం 55. చెరుకుపల్లి 56. భట్టిప్రోలు 57. రేపల్లె.

**16.జిల్లా చరిత్ర :** స్వాతంత్ర్య పోరాట కాలంలో రాష్ట్రంలో ఎందరో నేతలకు స్ఫూర్తి నిచ్చిన గుంటూరు జిల్లా పల్నాడు పౌరుషానికి పేరొందింది. భట్టిప్రోలు, అమరావతి, నందికొండ, (నాగార్జునసాగర్) ప్రాంతాలు బౌద్ధమత కేంద్రాలుగా విశేష ప్రాధాన్యతను సంతరించుకొన్నాయి. చీరాల-పేరాల సత్యాగ్రహం, పెదనందిపాడు, స్వాతంత్ర్య పోరాటాలు జిల్లావాసుల దేశభక్తికే నిదర్శనాలు. సుప్రసిద్ధమైన వర్జీనియా పొగాకు పుష్కలంగా పండే ఈ ప్రాంతం వాణిజ్య పంటలకు అన్ని రకాలుగా అనుకూలమైంది.

## గుంటూరు జిల్లాలోని దర్శనీయ స్థలాలు



**1.ఉండవల్లి గుహలు :** పవిత్ర కృష్ణానదీ తీరానికి మైలున్నర దూరంలో ఉండవల్లి గ్రామానికి సమీపంలో వున్న కొండలో గుహలు, కొండమీద అనంత పద్మనాభ స్వామి దేవాలయం, అతిప్రాచీనమైన మన శిల్పకళా వైభవాన్ని సంస్కృతికి ప్రతిబింబించే బౌద్ధ గుహాలయమే. అనంత పద్మనాభస్వామి ఆలయగుహ.

**2.గుత్తికొండ బిలం :** గుంటూరు జిల్లాలోని పిడుగురాళ్ళ మండలం, గుత్తికొండ గ్రామానికి 5 కి.మీ. దూరంలోవున్న గుత్తికొండ బిలం **"దక్షిణకాశి"**గా పిలువబడుతున్నది.

**3.మాచర్ల :** ఆంధ్రుల అలనాటి ఔన్నత్యానికి, చిత్ర శిల్పకళలకు ప్రతీకగా, నేటికి పల్నాటి వాసుల ఆరాధ్యదైవంగా భాసిల్లుతున్న మాచర్ల శ్రీ లక్ష్మీ చెన్నకేశవస్వామి ఆలయానికి ఆంధ్ర రాష్ట్రంలో ప్రముఖస్థానం వుంది. రాష్ట్రంలోనే రెండవ ఎత్తైన రథం ఈ ఆలయంలో వుంది.

**4.తెనాలి :** "ఆంధ్రాప్యారిస్"గా పేరుపొందిన తెనాలి పట్టణంలో అత్యంత ప్రాచీన ఆలయం శ్రీ రామలింగేశ్వర ఆలయం. అష్ట భుజ దుర్గ అమ్మవారు చూడదగినది. పంచముఖ ఆంజనేయ స్వామి ఆలయము కూడా దర్శించదగినది.

**5. మంగళగిరి నవులూరు పుట్ట :** మంగళగిరి రైల్వేస్టేషన్ నుండి కేవలం కిలోమీటరు దూరంలో ఆరు ఎకరాల సువిశాలమైన మామిడితోటలో నవులూరు పుట్ట వున్నది.

**6.ధరణికోట :** శ్రీ విఘ్నేశ్వరస్వామి ఆలయం ధరణికోట (అమరావతి) విన్యాత భక్తి ప్రపత్తులను, ఖ్యాతిని కల్గిస్తున్న ఈ ఆలయదర్శనం సర్వపాపహరణం సర్వ సిద్ధికరం, సర్వమంగళకరం అనేచెప్పాలి.



**7.తెనాలి :** ఆంధ్రాప్యారిస్‌గా ఖ్యాతినార్జించిన తెనాలి పట్టణంలో అంతర్భాగమై రేపల్లె రైల్వే బ్రిడ్జి సమీపంలో నిర్మితమైన శ్రీ లక్ష్మీ పద్మావతీ సమేత శ్రీ వైకుంఠపురం వేంకటేశ్వరస్వామి దేవస్థానం భారతదేశంలోని దివ్య క్షేత్రాలలో ఒకటిగా ప్రసిద్ధికెక్కుతుంది.

**8.మంగళగిరి కొండ :** భరతఖండంలో వున్న తొమ్మిది నృసింహ క్షేత్రాలలో మంగళాద్రి (మంగళగిరి) అత్యంత ప్రధానమైనది. ఆంధ్ర రాష్ట్రానికి నడిబొడ్డుగా వున్న విజయవాడకు కేవలం 12 కి.మీ. దూరంలో వున్న "మంగళగిరి"లో కొలువై వున్న శ్రీ లక్ష్మీ నృసింహస్వామిని దర్శించిన పునర్జన్మ వుండదని ప్రతీతి. ఈ స్వామికి పానకాల స్వామి అనుపేరు గలదు.

**9.అమరావతి :** గుంటూరుకు 35 కి.మీ దూరంలో వున్న క్షేత్రం. ఆంధ్ర శిల్పానికి పర్యాయపదం అమరావతి. భారతదేశంలోని పంచారామములలో ఇక్కడి అమరేశ్వర స్వామి ఆలయం ప్రఖ్యాతమైనది. ఇక్కడి అమ్మవారు బాలాత్రిపురసుందరీ దేవి.

**10.వినుకొండ :** త్రేతాయుగంలో రావణుడు మాయాభిక్షువు వేషంలో సీతాదేవిని అపహరించుకు వెళ్ళే సమయంలో ఇక్కడగల కొండపై నివసిస్తున్న జటాయువు పక్షి రావణునితో పోరాడి నిస్సహాయురాలై సీతాన్వేషణ కోసం వచ్చిన శ్రీరామచంద్రునికి విషయం చెప్పి అసువులు బాసిందని, సీతాపహరణ గురించి శ్రీరాముడు ఈ కొండపై "విన్నందునే" ఈ గ్రామానికి 'విన్నకొండ' అని అది ప్రజానానుడిలో వినుకొండగా మారిందని చరిత్రకారులు చెబుతున్నారు. కొండ పైన ఆంజనేయస్వామి దేవాలయం కలదు. ఇచ్చటనే క్రొత్తగా వెలసిన లక్ష్మీగణపతి దేవాలయం దర్శించగలరు.

**11.పోలేరమ్మ(కొండపాటూరు) :** గుంటూరు జిల్లాలో కాకుమామ మండలం కొండపాటూలో "పోలేరమ్మ" దేవత స్వయంగా వెలసినదిగా నాలుగు శతాబ్దముల చరిత్రచెబుతుంది.

**12.కొమ్మూరు :** చరిత్ర ప్రసిద్ధి చెందిన పుణ్యక్షేత్రంలో శృంగపురిక్షేత్రం (కొమ్మూరి శివాలయం) ఒకటి. ఇది చోళరాజుల కాలంలో నిర్మించబడిందని చరిత్ర చెబుతున్నది. దక్షణ దేశ శివ ఆలయాల్లో ప్రముఖమైన క్షేత్రం ఇది. హిందూ దైవములలో శంకరుడు ఆదిదేవుడు. అలాంటి అగస్త్యేశ్వరస్వామి దేవాలయం ప్రముఖ పుణ్యక్షేత్రములలో ఒకటికావడం ఈప్రాంతం విశేషం.

**13.మస్తాన్ షా వలి దర్గా (గుంటూరు) :** రాష్ట్ర వ్యాప్తంగా హిందూ, ముస్లిం సోదరులని ఆకర్షిస్తూ మత సామరస్యానికి ప్రతీకగా నిలిచింది. గుంటూరు నగరంలోని హజరత్‌కాలే మస్తాన్ షావలిదర్గా మహిమాన్వితుడు శ్రీ కాలేమస్తాన్ షావలి పేర ఏర్పడిన దర్గా నేడు పుణ్యక్షేత్రంగా వెలుగొందుతున్నది.

**14.పొన్నూరు :** భక్తుని వివాహసాక్షార్థమై కాశీ నుండి తరలివచ్చిన భావ న్నారాయణ స్వామి ఏకశిలారూపులైన, 18 అడుగుల ఎత్తుగల ఆంజనేయస్వామి,

గరుత్మంతుల విగ్రహాలతో పొన్నూరులోని దేవాలయాలు రాష్ట్రేతర ప్రాంతాల నుండి సైతం భక్తులను ఆకర్షిస్తున్నాయి. నిత్యం వెలుగుతుండే అఖండజ్యోతులు ఈ ఆలయ ప్రాంగణంలోని మరోవిశిష్టత. సహస్ర లింగేశ్వరస్వామి ఆలయము చూడదగినది. భావన్నారాయణస్వామి మరియు కాశీ విశ్వేశ్వరస్వామి ఆలయం కూడా కలదు. ఇచట వాసవీ కన్యకాపరమేశ్వరి ఆలయం కూడా కలదు.

**15.కోటప్పకొండ (నరసారావుపేట) :** దక్షిణ భారతదేశంలో ప్రసిద్ధి చెందిన శైవక్షేత్రంగా భాసిల్లుతున్నది. "కోటప్పకొండ" శ్రీత్రికోటేశ్వర స్వామి ఆలయం నరసారావుపేట పట్టణానికి దక్షిణాన 11 కి.మీ. దూరంలో వున్నది. ఈ కొండపైన కాకులు రావు. ఈ క్షేత్రం వెయ్యి ఏళ్ళకు పైగా చరిత్ర కలిగి యున్నది. ప్రతిఏడాది మహాశివరాత్రి పర్వదినాన కోటప్పకొండలో నేత్రపర్వంగా జరిగే తిరునాళ్ళకు మన రాష్ట్రం నలుమూలల నుంచే గాక, ఇతర రాష్ట్రల నుంచి కూడా లక్షలాది మంది భక్తులు తరలివచ్చి స్వామిని దర్శించుకుంటారు. ఈ మధ్య కాలములో ఈ క్షేత్రమును ఎంతో అందముగా తీర్చిదిద్దినారు.

**16.పెదకాకాని :** రాష్ట్రంలోని పొంగలి నివేదనలకు గుంటూరు, విజయవాడ రహదారిలోనున్న ప్రసిద్ధి చెందిన పుణ్యక్షేత్రం పెదకాకాని శ్రీ భ్రమరాంబా సమేత మల్లేశ్వరస్వామి దేవస్థానం. రాష్ట్రంలో మరి ఏ ఇతర దేవాలయాల్లో జరుగని విధంగా ఇక్కడ స్వామివారికి భక్తులు పొంగలిని నివేదించుకోవటం విశేషం. ఇచ్చట క్రైస్తవులకు ప్రసిద్ధిమైన దొరతోట, బాజీ బాబా దర్గా దర్శించదగినవి.

**17.చేబ్రోలు :** చేబ్రోలు గుంటూరుకి 14 కి.మీ. దూరంలో గుంటూరు –పొన్నూరు రహదారిపై వుంది. చేబ్రోలు గ్రామంలో నూటొక్క దేవాలయాలు భావులు వుండేవవి ప్రతీతి. కొన్ని శిధిలం కాగా మరికొన్ని దేవాదాయ శాఖ అధీనంలో వున్నవి. ఇక్కడున్న ఆలయాలు భారతదేశంలో కాశీలో తప్ప మరెక్కడా లేవు. భీమేశ్వరస్వామి ఆలయం, నాగేశ్వరస్వామి ఆలయములు చూడదగినవి. ఆది కేశవాలయం కూడ కలదు. ప్రపంచంలో ఎక్కడా లేనివిధంగా "బ్రహ్మదేవాలయం"= చేబ్రోలులో మాత్రమే వుంది. ఇంకా అనేక దేవాలయాలు తప్పక చూడదగినవి వున్నాయి. ఇచ్చట రెండు శ్రీ సాయిబాబా దేవాలయములు చూడదగినవి.

**18.సత్తెనపల్లి :** సత్తెనపల్లికి చెందిన "ఫిరోజిబుషి" అనేత తత్త్వవేత్త సమాధి మందిరం ఉన్నది. ఆయన లక్షాలాదిమంది ప్రజానీకానికి ఆధ్యాత్మిక చింతనను బోధించడం ద్వారా వారిజీవితాలలో వెలుగునింపిన మహనీయుడు. ఇప్పటికీ శతాబ్దానికి పైగా సత్తెనపల్లి పరిసర ప్రాంతాలలో ఆ మహానుభావుడు ప్రజల ఆరాధ్యదైవంగా పూజలందుకుంటున్నారు.

**19.నాదెండ్ల :** నూట ఒక్క దేవాలయాలతో చరిత్ర ప్రసిద్ధిగాంచిన గ్రామం నాదెండ్ల. పూర్వం ఈ గ్రామానికి నందునిపట్నం, నందపురం అనే పేర్లు వున్నా కాలక్రమంలో నాదెండ్లగా రూపాంతరం చెందింది. చిన్నా పెద్దా కలిపి మొత్తం నూట ఒక్క దేవాలయాలు ఉండటం ఈ గ్రామ విశేషం.



**20.కోళ్ళూరు :**పెదకూరపాడు నియోజవర్గంలోని బెల్లంకొండ మండలంలోని కోళ్ళూరు గ్రామం ప్రపంచ పేరుగన్నది. ఈ గ్రామంలోనే ప్రపంచ ప్రసిద్ధిగాంచిన "కోహినూరు వజ్రం" దొరికిందని వాడుక. ఈ గ్రామంలోని పంచాయితీ పరిధిలోని గొల్లపేట, పులిచింతల గ్రామాలలోని శ్రీ ప్రసన్నాంజనేయస్వామి దేవాలయం చారిత్రాత్మిక ప్రాధాన్యత సంతరించుకున్నది.

**21.సత్రశాల :** పల్నాటిసీమలో రెంటచింతల ఆధ్యాత్మిక జ్యోతిర్మండలమైన ఆంధ్రప్రదేశ్‌లో వీర భాగవత క్షేత్రమని ప్రఖ్యాతిచెందిన పవిత్ర కృష్ణానది తీరంలో "సత్రశాల"అను శైవక్షేత్ర రాజ్యమున్నది. ఇచ్చట మల్లేశ్వర లింగం స్వయం వ్యక్తమైనది. ఈ దివ్య లింగం భూగర్భంలో అదృశ్యమానంగా ఉండటంచేత పూజార్చన అభిషేకాదులకు అనువుగా స్వయం భూలింగంపైన ఇంకొక లింగం ప్రతిష్ఠించబడినది. ఈ అతి ప్రాచీన క్షేత్రంలో మహర్షి శ్రేష్టుడైన **"విశ్వామిత్రుడు"** యజ్ఞంచేసిన ఆశ్రమస్థలం అయినందున ఈ క్షేత్రమునకు "సత్రశాల" అనే పేరు వచ్చినదని అక్కడి శాసనాల బట్టి తెలియుచున్నది.

**22.మోరతోట :** రేపల్లె మండలంలోనే మోరతోట గ్రామంలో గల ప్రాచీన ముక్తేశ్వరస్వామి ఆలయం రేపల్లె నుండి దాదాపు 12 కి.మీ. దూరంలో గల ముక్తేశ్వరస్వామి ఆలయం గతవైభవానికి నిదర్శనంగా వుంది.

**23.చేజర్ల :** నకరికల్లు మండలం చేజెర్ల గ్రామంలో శతాబ్దాల క్రితం కపోతేశ్వరస్వామి ఆలయం నిర్మితమైనదని చరిత్ర చెబుతోంది. ఎంతో ప్రసిద్ధిచెందిన ఈ దేవాలయం చూడదగ్గది.

**24.గోవాడ :** శ్రీ బాలకోటేశ్వరస్వామి ఆలయానికి ఈశాన్య దిక్కున నిర్మించిన నవగ్రహాలయం అష్టకోణాకారంలో నిర్మితమైంది. ఈ విధంగా నిర్మించడం చాలా అరుదు.

**25.చిలకలూరిపేట :** పై కప్పులేని ఆంజనేయస్వామి దేవాలయం తప్పక చూడగలరు మరియు శ్రీ రామాలయము దర్శించగలరు.

**26.బాపట్ల :** గుంటూరు జిల్లా బాపట్లలోని శ్రీ భావనారాయణస్వామి ఆలయం ఆంధ్రదేశంలో వెలసిన పంచ భావనారాయణ క్షేత్రాలలో ఒకటి. లక్ష్మీ గణపతి ఆలయము కూడా దర్శనీయము.

**27.నంబూరు :**విజయవాడ గుంటూరు రహదారిలో నంబూరు రైల్వేస్టేషన్‌కు సమీపములో నున్న శ్రీ సద్గురు కాళీ ప్రసాద్ బాబాగారి ఆశ్రమం దర్శించదగినది.

**28.చిలుమూరు :** ఇచ్చట గల రామలింగేశ్వరస్వామి దేవాలయం దర్శించగలరు.

**29.అమీనాబాద్ :** మూలాంకరేశ్వరీ అమ్మవారి దేవస్థానము కొండపైన ఉన్నది.

**30.అల్లూరు :**ఇచ్చటగల శ్రీ లక్ష్మీ నరసింహస్వామి వారి దేవస్థానం చూడగలరు.

**31.సంగంజాగర్లమూడి :** తెనాలికి దగ్గరలో ఉన్న సంగంజాగర్లమూడిలో అతిపురాతన మైన సంగమేశ్వర స్వామివారి దేవస్థానం దర్శించగలరు.

**32.మోపర్రు :** ఇచ్చట గల చౌడేశ్వరస్వామి వారి దేవాలయం దర్శించదగినది.

**33.మోరంపూడి :** ఇచ్చట గల మహాంకాళి అమ్మవారిని దర్శించగలరు.

**34.చంఘిజ్‌ఖాన్‌పేట :** యడ్లపాడు మండలంలోని చంఘిజ్‌ఖాన్‌పేటలో వేణుగోపాల స్వామి దేవాలయము దర్శించగలరు.

**35.దైద :** గురజాల మండలంలోని దైద గ్రామంలో అమరలింగేశ్వరస్వామి దేవాలయమునకు శివరాత్రి నాడు అధిక సంఖ్యలో భక్తులు వస్తారు.

**36.నందివెలుగు :** గుంటూరు జిల్లా నంది వెలుగులో నందిజ్యోతిష పురుషుడు (విష్ణుమూర్తి దేవాలయమును) దర్శించగలరు.

**37.సీతానగరం :** గుంటూరు జిల్లాలోని కృష్ణానది ప్రక్కన ఉన్న కృష్ణా తీరంలో కోదండరామాలయం మరియు ఆంజనేయస్వామిని మరియు ఎండల ఆంజనేయ స్వామిని విశేషత సంచరించుకున్నది.

**38.వలివేరు :**వలివేరులో స్వయంభూతేశ్వరస్వామి దేవాలయం దర్శించగలరు.

**39.దుగ్గిరాల :**తెనాలికి దగ్గరలో ఉన్న దుగ్గిరాలలో కేశవస్వామి దేవాలయం దర్శించగలరు.

**40.చందవోలు :** గుంటూరు జిల్లాలోని చందవోలులో లింగోద్భవస్వామి దేవాలయం దర్శించగలరు. బండ్లమ్మ దేవాలయము చూడదగినది. చెన్నకేశవాలయం చూడదగినది.

**41.కొల్లూరు :** కొల్లూరులో అనంత భోగేశ్వర స్వామివారి దేవాలయం దర్శించదగినది.

**42.బొప్పుడి :** ఆంజనేయస్వామి ఆలయం చూడగలరు. చిలకలూరిపేట – గుంటూరు హైవేలో వున్నది.

**43.మోటుపల్లి :** ఇచ్చట గల కోదండరామస్వామి దేవాలయం దర్శించగలరు.

**44.అమర్తలూరు :** అమృతలూరులోని భావనారాయణ స్వామి దేవాలయమును దర్శించగలరు. అమృతేశ్వరస్వామి ఆలయము చూడగలరు.

**45.నరసరావుపేట :** భావనారాయణ స్వామి దేవాలయమ, మరియు పాతూరు శివాలయమును దర్శించగలరు. సత్తెనపల్లి రోడ్డులోని శ్రీ సాయిబాబా గుడిని ప్రకాశ్ నగర్‌లోని శ్రీ సాయిబాబా దేవాలయం దర్శించగలరు.

**46.ఇనుమెల్ల :** గుంటూరు జిల్లాలో ఇనుమెల్లలో భావనారాయణస్వామి దేవాలయం దర్శించగలరు.

**47.శేకూరు :** ఇచ్చట సోమేశ్వరస్వామి ఆలయము మరియు కుండలేశ్వర స్వామి ఆలయము చూడదగినది. అమ్మవారు బాలాత్రిపుర సుందరీదేవి మరియు వేణుగోపాల స్వామి వేంకటేశ్వరస్వామి ఆలయములు కూడా దర్శించదగినదే.

**48.వడ్లమూడి :** ఈ గ్రామాములో చంద్రమౌళీశ్వర స్వామి దేవాలయమును దర్శించగలరు.



**49.నిడుబ్రోలు :** చౌడేశ్వరస్వామి ఆలయము చాలా పురాతనమైనది. అమ్మవారు పార్వతీదేవి. ఈ గ్రామములోనే కేశవాలయము కూడా కలదు.

**50.గురజాల :** ఈ పట్టణము నందు పాత పాటేశ్వరీ దేవి ఆలయము ప్రతి ఒక్కరు దర్శించదగినది. మరియు వీరభద్రేశ్వర స్వామి ఆలయము కూడా అత్యంత ప్రాచీనమైనది. ఈ ఆలయములో గల నాగదేవతలతో నున్న నాగ స్తంభమును ప్రతి ఒక్కరూ చూడవలసినదే.

**51.గుంటూరు :** అత్యంత ప్రముఖ రామనామ క్షేత్రమును తప్పక దర్శించగలరు. భారతదేశములో ప్రసిద్ధి చెందిన "365 రోజులు 24 గంటల అఖండ రామనామ జపము" చేయు ఏకైక శివాలయము. ప్రతి సంవత్సరము డిశంబర్ మాసములో శ్రీరామకోటి మహత్యములకు వేలాది మంది వస్తారు.

**52.కారంపూడి :**బ్రహ్మనాయుడి చే నిర్మితమయిన చెన్నకేశవ స్వామి ఆలయము చాలా ప్రాచీన మయినది.

**53.ఎత్తిపోతల :** ఎత్తిపోతల అనగానే జలపాతంతో ఉన్న రమణీయ ప్రదేశం గుర్తుకు వస్తుంది. ఇచ్చట మూడు గుహలయములు కలవు. అవి రంగ నాయక స్వామి ఆలయము, మధుమతి ఆలయము మరియు దత్తాత్రేయ దేవాలయము.

**54.క్వారీ :** శివాలయము అమ్మవారి దేవాలయము శివరాత్రి తిరునాళ్ళకు ఎక్కువమంది వస్తారు. గుంటూరు నుండి తెనాలి వెళ్ళేదారిలో ఈ ఆలయం కలదు.

**55.తాడికొండ :** ఇచ్చట గల కొండ మల్లికార్జునస్వామి దేవాలయం తప్పక దర్శించగలరు మరియు శ్రీసాయిబాబా దేవాలయం చాలా ప్రాముఖ్యత కలిగినది.

**56.కొమ్మూరు :** ఇచ్చట గల అగస్త్యేశ్వరస్వామి దేవాలయం తప్పక దర్శించగలరు.

**57.తంగేడు :** ఇచ్చట గల రామలింగేశ్వస్వామి దేవాలయం తప్పక దర్శించగలరు

**58.పేరిచర్ల :** ఇచ్చట గల కొండమీద గల కైలాసనాథ స్వామి దేవాలయం దర్శించగలరు. ఇచ్చట గల మామిడి తటలకు కార్తీక సమారాధనలకు ఎక్కువ మంది వస్తారు.

**59.అమీనాబాదు :**కొండపైన శివాలయము ప్రతి ఒక్కరు దర్శించదగినది.

**60.ఫిరంగిపురము :** కొండపైన మేరీమాత ఆలయములో డిశెంబర్ మాసములో ఉత్సవములు జరుగును.

**61.ఎత్తపోతల :** ఇచ్చట దత్తాత్రేయ గుహాలయం కలదు. జలపాతం చూడవలసినదే.

**62.నాగార్జున కొండ :** ఇక్కడి బౌద్ధ శిల్ప సంపద చూడతగినది. ఇచట త్రవ్వకాలలో విష్ణు అష్టభుజస్వామి ఆలయం, నవగ్రహాలయం, మూడు కార్తికేయ దేవాలయాలు కలవు. ప్రతి ఒక్కరూ చూడదగినది.

**63. పెదకూరపాడు** : ఇచ్చట గల నాగేంద్రస్వామి పుట్ట దర్శించదగినది.

**64. రామచంద్రపాలెం:**(గారపాపడు) తక్కెళ్లపాడు గ్రామానికి 2 కి.మీ. దూరములో వున్న ఈ గ్రామములో ధ్వజ స్థంబము వున్న గణేశ దేవాలయం దర్శించదగినది.

**65. బుడంపాడు** : ఈ గ్రామములో గణపతి దేవాలయం దర్శించదగినది.

**66. తాడేపల్లి** : ఈ గ్రామమలో మాతాశివ చైతన్య ఆశ్రమము చూడదగినది, మరియు శ్రీ సాయిబాబా దేవాలయము కూడా కలదు.

**67. విశ్వనగర్** : శ్రీ విశ్వంజీ గారిచే స్థాపించబడిన విశ్వగురుక్షేత్రము దర్శించదగినది. చిలకలూరిపేట నుండి గుంటూరు వెళ్ళేదారిలో ఉన్నది.

**68. అనఘాదేవీ సమేత దత్త దేవాలయం** : శ్రీ గణపతి సచ్చిదానంద స్వామి గారిచే స్థాపించబడిన ఈ ఆలయం చిలకలూరిపేట హైవే రోడ్డులో ఉన్నది.

**69. సూర్యనారాయణ స్వామి ఆలయం** : గుంటూరు - పెదకాకాని హైవే మీద కొద్దిగా లోపలికి వెళ్ళితే ఈ ఆలయం కనిపిస్తుంది. క్రొత్తగా నిర్మించారు.

**70. గాయత్రీ పీఠం** : నారాకోడూరులోని గాయత్రీపీఠము ప్రతి ఒక్కరు దర్శించదగినది.

**71. మానస సరోవరం** : గుంటూరు దగ్గరలోని తక్కెళ్ళపాడు గ్రామానికి సమీపములో మానస సరోవరం పార్కు యాత్రికులను ఎంతో ఆకట్టుకుంటుంది.

**72. తక్కెళ్ళపాడు** : ఇచ్చటగల పక్షుల కేంద్రం చాలా మంది దర్శించదగినది.

## గుంటూరులోని శ్రీ షిర్డీసాయిబాబా మందిరములు

1. **శ్రీ షిరిడిసాయిబాబా మందిరము**
   జనచైతన్య ప్లాట్సు, ఆటో నగర్, రెడ్డిపాలెం పోస్టు, పెదకాకాని మండలం.
2. **శ్రీ షిరిడిసాయిబాబా మందిరము**
   శాంతి ఆర్ట్సు దగ్గర, ఆదిత్య నగర్, రెడ్డిపాలెం పోస్టు,
   పెద్దకాకాని మండలం, గుంటూరు జిల్లా.
3. **శ్రీ షిరిడిసాయిబాబా మందిరము**
   శ్రీ ఆంజనేయస్వామి గుడి ఆవరణలో, 18వ లైను, శారదానగర్ కాలనీ,
   రెడ్డిపాలెం పోస్టు, పెదకాకాని మండలం, గుంటూరు జిల్లా.
4. **శ్రీ షిరిడిసాయిబాబా మందిరము**
   ఓంకార్‌గుడివద్ద, మెయిన్‌రోడ్, 5వ లైన్, మల్లికార్జునగర్, శారదానగర్ కాలనీ,
   రెడ్డిపాలెం పోస్టు, పెదకాకాని మండలం, గుంటూరు జిల్లా.
5. **శ్రీ షిరిడిసాయిబాబా మందిరము**
   అయ్యప్ప స్వామి దేవాలయం ఆవరణలో, 9వ లైను,
   మెయిన్‌రోడ్, నెహ్రూనగర్, గుంటూరు.



6. **శ్రీ షిరిడిసాయిబాబా మందిరము**
   నెహ్రూనగరం, గుంటూరు పోస్టు, గుంటూరు జిల్లా.
7. **శ్రీ షిరిడిసాయిబాబా మందిరము**
   ఆర్.టి.సి. కాలనీ, గుంటూరు పోస్టు, గుంటూరు జిల్లా.
8. **శ్రీ షిరిడిసాయిబాబా మందిరము**
   అంకమ్మ గుడిదగ్గర, పాత గుంటూరు, గుంటూరు పోస్టు, గుంటూరు జిల్లా.
9. **శ్రీ షిరిడిసాయిబాబా మందిరము**
   1/5, యాదవుల వీధి, పాత గుంటూరు,
   గుంటూరు పోస్టు, గుంటూరు జిల్లా,
10. **శ్రీ షిరిడిసాయిబాబా మందిరము**
    రామిరెడ్డితోట, గుంటూరు పోస్టు, గుంటూరు జిల్లా.
11. **శ్రీ షిరిడిసాయిబాబా మందిరము**
    రైల్వేస్టేషన్‌రోడ్డు మలుపులో, గవర్నమెంటు హాస్పటల్ దగ్గర, రైలుపేట,
    గుంటూరు పోస్టు, గుంటూరు జిల్లా.
12. **శ్రీ షిరిడిసాయిబాబా మందిరము**
    శివాలయం ఆవరణలో, స్టేట్‌బ్యాంక్ దగ్గరలో, 4/4, అరండల్‌పేట,
    గుంటూరు పోస్టు, గుంటూరు జిల్లా.
13. **శ్రీ షిరిడిసాయిబాబా మందిరము**
    అష్టలక్ష్మి అమ్మవారి దేవాలయములో (చిన్నగది), చౌత్రా
    గుంటూరు పోస్టు, గుంటూరు జిల్లా.
14. **శ్రీ షిరిడిసాయిబాబా మందిరము**
    7/2, అరండల్‌పేట, గుంటూరు పోస్టు, గుంటూరు జిల్లా.
15. **శ్రీ షిరిడిసాయిబాబా మందిరము**
    జ్యోతీ మహల్ దగ్గర, 16/2, అరండల్‌పేట,
    గుంటూరు పోస్టు, గుంటూరు జిల్లా.
16. **శ్రీ షిరిడిసాయిబాబా మందిరము**
    శ్రీనగర్‌కాలనీ, 7వలైను చివర, వసంతరాయపురం,
    గుంటూరు పోస్టు, గుంటూరు జిల్లా.
17. **శ్రీ షిరిడిసాయిబాబా మందిరము**
    ద్వారకామాయి విగ్రహం, వేంకటేశ్వరనగర్,
    అమరావతిరోడ్డు, గోరంట్ల పంచాయితీ-522 034.
18. **శ్రీ షిరిడిసాయిబాబా మందిరము (గుంటూరులో ప్రథమ బాబా మందిరము)**
    సాయిబాబారోడ్డు, చంద్రమౌళి నగర్ ఎదురుగా,
    గుంటూరు పోస్టు, గుంటూరు జిల్లా.

**19. శ్రీ షిరిడిసాయిబాబా మందిరము**
3/5, విద్యానగర్, (అండర్ కన్‌స్ట్రక్షన్)
గుంటూరు పోస్టు, గుంటూరు జిల్లా.

**20. శ్రీ షిరిడిసాయిబాబా మందిరము**
3వ సందు, వికాస్‌నగర్,
గుంటూరు పోస్టు, గుంటూరు జిల్లా.

**21. శ్రీ షిరిడిసాయిబాబా మందిరము**
జె.కె.జి. కాలేజి ఎదురుగా, ఎస్.బి.ఐ. కాలనీ,
గుంటూరు పోస్టు, గుంటూరు జిల్లా.

**22. శ్రీ షిరిడిసాయిబాబా మందిరము**
అష్టసిద్ధిగణపతి దేవాలయావరణలో, నాయీబ్రహ్మణకాలనీ,
మారుతీనగర్, గుంటూరు పోస్టు, గుంటూరు జిల్లా.

**23. శ్రీ షిరిడిసాయిబాబా మందిరము**
మెయిన్‌రోడ్డు, రాజేంద్రనగర్, గుంటూరు పోస్టు, గుంటూరు జిల్లా.

**24. శ్రీ షిరిడిసాయిబాబా మందిరము**
నెహ్రూనగర్, గుంటూరు పోస్టు, గుంటూరు జిల్లా.

**25. శ్రీ షిరిడిసాయిబాబా మందిరము**
6వ లైను, పండరీపురం (చిన్నగది-రోడ్డుముందు)
గుంటూరు పోస్టు, గుంటూరు జిల్లా.

**26. శ్రీ షిరిడిసాయిబాబా మందిరము**
బడబానల వీరప్రతాప వీరాంజనేయస్వామివారి ఆలయ ఆవరణలో
5/7, బ్రాడీపేట, గుంటూరు పోస్టు, గుంటూరు జిల్లా.

**27. శ్రీ షిరిడిసాయిబాబా మందిరము**
బండ్లమూడి హనుమాయమ్మ గరల్స్ హైస్కూలు ఎదురుగా,
2/17-8, బ్రాడీపేట, గుంటూరు పోస్టు, గుంటూరు జిల్లా.

**28. శ్రీ షిరిడిసాయిబాబా మందిరము**
శ్రీ షిర్డిసాయిబాబా దీనజనసేవాసమితి,
సేవాశ్రమము, 2/13, బ్రాడీపేట, గుంటూరు పోస్టు, గుంటూరు జిల్లా.

**29. శ్రీ షిరిడిసాయిబాబా మందిరము**
ఓంకార క్షేత్ర ఆవరణలో, 2/13, బ్రాడీపేట,
గుంటూరు పోస్టు, గుంటూరు జిల్లా.

**30. శ్రీ అభయహస్త షిరిడిసాయిబాబా మందిరము** (పాలరాయి విగ్రహం)
4/7, బ్రాడీపేట, గుంటూరు - 522 002.



**31. శ్రీ షిరిడిసాయిబాబా మందిరము** (నల్లరాతి విగ్రహం)
కోనేరు దగ్గర, ఆర్. అగ్రహారం, గుంటూరు పోస్టు, గుంటూరు జిల్లా.

**32. శ్రీ షిరిడిసాయిబాబా మందిరము**
శ్రీ సాయిరామమందిర సేవాసమాజం, (రామమందిరం ఆవరణలో)
కంకరగుంట గేటు దగ్గరలో, గుంటూరు పోస్టు, గుంటూరు జిల్లా.

**33. శ్రీ షిరిడిసాయిబాబా మందిరము**
శ్రీ ప్రసన్నాంజనేయస్వామి గుడి ఆవరణలో, 2వ లైను,
ఎ.టి. అగ్రహారం, గుంటూరు పోస్టు, గుంటూరు జిల్లా.

**34. శ్రీ షిరిడిసాయిబాబా మందిరము**
గాయత్రీ అమ్మవారి గుడిలో, 1వ లైను, ఎ.టి. అగ్రహారం,
గుంటూరు పోస్టు, గుంటూరు జిల్లా.

**35. శ్రీ షిరిడిసాయిబాబా మందిరము (ద్వారకామాయి)**
చంద్రమౌళీశ్వర దేవస్థాన ఆవరణలో, జూట్‌మిల్ దగ్గర,
చంద్రమౌళీశ్వర అగ్రహారం, గుంటూరు పోస్టు, గుంటూరు జిల్లా.

**36. శ్రీ షిరిడిసాయిబాబా మందిరము**
పాతపట్టాభిపురం, స్వామిథియేటరు ప్రక్కబజారు,
గుంటూరు పోస్టు, గుంటూరు జిల్లా.

**37. శ్రీ షిరిడిసాయిబాబా మందిరము**
సప్తఋషి ఆశ్రమం, వేణుగోపాల నగర్, ఎస్.బి.ఐ. కాలనీ,
గుంటూరు పోస్టు, గుంటూరు జిల్లా.

**38. శ్రీ షిరిడిసాయిబాబా మందిరము**
శ్రీ షిర్డి సాయినాధ్ సాంస్కృతిక కేంద్రము, హౌసింగ్‌బోర్డు కాలనీ,
నల్లపాడు రోడ్డు, గుంటూరు పోస్టు, గుంటూరు జిల్లా.

**39. శ్రీ షిరిడిసాయిబాబా మందిరము**
నల్లపాడు రోడ్డు, గుంటూరు పోస్టు, గుంటూరు జిల్లా.

**40. శ్రీ షిరిడిసాయిబాబా మందిరము**
ఏటుకూరు రోడ్డు, గుంటూరు పోస్టు, గుంటూరు జిల్లా.

## గుంటూరులోని ప్రముఖ దేవాలయములు

| | | | |
|---|---|---|---|
| 1. | **ఆంజనేయస్వామి ఆలయం** | - | కొత్తపేట |
| 2. | **వేంకటేశ్వరస్వామి ఆలయం** | - | లాలాపేట |
| 3. | **జగన్నాధస్వామి ఆలయం** | - | కొత్తపేట |
| 4. | **వేంకటేశ్వరస్వామి ఆలయం** | - | బృందావన్ గార్డెన్స్ |
| 5. | **వేంకటేశ్వరస్వామి ఆలయం** | - | అన్నపూర్ణనగర్ (అమరావతి రోడ్డు) |

6. వేంకటేశ్వరస్వామి ఆలయం - శ్రీనివాస నగర్ కాలనీ
7. వేంకటేశ్వరస్వామి ఆలయం - శ్రీనగర్, 5వ లైను
8. వేంకటేశ్వరస్వామి ఆలయం - ఆర్ అగ్రహారం
9. నరసింహస్వామి ఆలయం - ఆర్ అగ్రహారం
10. శివాలయం - ఆర్ అగ్రహారం
11. శివాలయం - అరండల్‌పేట 4వ లైను
12. అష్టలక్ష్మి దేవాలయం - అరండల్‌పేట 4వ లైను
13. ఓంకార క్షేత్రము - బ్రాడీపేట 2/13
14. బృందావన క్షేత్రము - డొంకరోడ్డు
15. శివాలయము - కొత్తపేట
16. శివాలయము (అగస్త్యముని ప్రతిష్ఠ) - పాత గుంటూరు
17. గాయత్రీ దేవాలయము - శ్యామలానగర్
18. రామాలయము - చేబ్రా
19. కాళంగీ మర్ధనస్వామి దేవాలయము - ఆర్ అగ్రహారం (కోనేటి సందు)
20. ఆంజనేయస్వామి దేవాలయము - ఆర్ అగ్రహారం
21. హరి హర దత్త క్షేత్రము - పట్టాభిపురం
22. అయ్యప్ప దేవాలయము - సంపత్ నగర్
23. హరనాథ బాబా దేవాలయము - జిన్నా టవర్
24. వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవాలయం - పండ్ల మార్కెట్
25. గొల్ల ఆంజనేయస్వామి దేవాలయము - చౌత్రా
26. దాసాంజనేయస్వామి దేవాలయము - చౌత్రా
27. అష్టలక్ష్మి దేవాలయం - చౌత్రా
28. బ్రహ్మం గారి గుడి - చౌత్రా
29. యాజ్ఞవల్క్య క్షేత్రము - పండరీపురం
30. ఆంజనేయస్వామి దేవాలయము - మారుతీ నగర్
31. అంకమ్మ తల్లి (గ్రామ దేవత) - పాత గుంటూరు
32. రాఘవేంద్ర స్వామి దేవాలయము - బ్రాడీపేట
33. కనకదుర్గ దేవాలయము - పొన్నూరు (రహదారిలో)
34. వేణుగోపాల స్వామి దేవాలయము - పాత గుంటూరు
35. సత్యనారాయణస్వామి దేవాలయము - పాత గుంటూరు
36. 5 రామాలయములు - కొరిటిపాడు
37. ఆంజనేయస్వామి దేవాలయము - పాత గుంటూరు
38. గౌడీయ మఠము - కొత్తపేట
39. బ్రహ్మంగారి మఠము - అమరావతి రోడ్డు



40. సత్యనారాయణ స్వామి ఆలయము - అరండల్‌పేట 11వ లైను
41. వేంకటేశ్వరస్వామి దేవాలయము - శ్రీనివాసరావు తోట
42. పెద్దమహాలక్ష్మమ్మ
చిన్నమహాలక్ష్మమ్మ - కొత్తపేట
43. భావనాఋషి స్వామి - కొత్తపేట
44. వేణుగోపాలస్వామి - వేణుగోపాల నగర్
45. రామాలయము(పాలరాతి విగ్రహాలు) - చౌత్రా
46. రామాలయము - అమరావతి రోడ్డు
47. ఆంజనేయస్వామి - రామిరెడ్డి తోట
48. రామాలయము - నెహ్రూ నగర్
49. వినాయకుడి గుడి - డి.ఎస్.కళ్యాణమండపంరోడ్ చివర, కొత్తపేట
50. శివాలయము - సంపత్ నగర్
51. శారదాదేవి ఆలయము - సంపత్ నగర్, శంకరమఠము నందు
52. రాఘవేంద్రస్వామి గుడి - బృందావన్ గార్డెన్స్

## 8. ప్రకాశం జిల్లా

1. వైశాల్యం : 17,626 చ.కి.మీ.
2. జనాభా : 29,60,000
3. అక్షరాస్యత : 43%
4. మండలాలు : 56 (958 గ్రామాలు)
5. నదులు : మూసీనది, గుండ్లకమ్మ, పాలేరు.
6. అడవులు : 25%
7. పంటలు : వేరుశెనగ, సజ్జలు, రాగులు, మిరప, గంటెలు
8. ఖనిజాలు : ప్రధానంగా పలకరాయి, మాగ్నటైట్, సిలికా, క్వార్ట్జ్ బేరియం సల్ఫేట్
9. పరిశ్రమలు : పాల ఉత్పత్తులు, స్పిన్నింగ్ మిల్స్, పురుగులు (క్రిమి సంహారిక) మందులు.

**10.** విజయనగరం నుండి ఈ జిల్లాలోని వివిధ ప్రాంతాలకు గల దూరం (సుమారుగా కి.మీ.లలో) :

| పట్టణం/నగరం | దూరం | పట్టణం/నగరం | దూరం |
|---|---|---|---|
| గిద్దలూరు | 150 కి.మీ. | సింగరాయికొండ | 36కి.మీ. |
| చీరాల | 60 కి.మీ. | అద్దంకి | 40 కి.మీ. |
| మార్కాపురం | 95 కి.మీ. | కందుకూరు | 45 కి.మీ. |
| కంభం | 108 కి.మీ. | పామూరు | 120 కి.మీ |
| కనిగిరి | 80 కి.మీ. | మేదరమెట్ల | 30 కి.మీ. |

**11. సరిహద్దులు :** తూర్పు – బంగాళఖాతం
పశ్చిమ – కర్నూలు జిల్లా
ఉత్తరం – గుంటూరు జిల్లా
దక్షిణం – నెల్లూరు జిల్లా

**12. ముఖ్యకేంద్రం :** ఒంగోలు

**13. రైల్వేస్టేషన్ :** ఒంగోలు

**14.ప్రధాన పట్టణాలు :** ఒంగోలు, చీరాల, మార్కాపురం, అద్దంకి, గిద్దలూరు, కందుకూరు, సింగరాయకొండ, వేటపాలెం.

**15.మండలాలు(56) :** 1. ఒంగోలు 2. టంగుటూరు 3. కొత్తపట్నం 4. నాగులుప్పల పాడు 5. చీమకుర్తి 6. మద్దిపాడు 7. సంతనూతలపాడు 8. అద్దంకి 9. కొరిసపాడు 10. జె. పంగులూరు 11. బల్లికురవ 12. సంతమాగులూరు 13. మార్టూరు 14. యద్దనపూడి 15. చీరాల 16. వేటపాలెం 17. చినగంజాం 18. పర్చూరు 19. ఇంకొల్లు 20. కారంచేడు 21. కందుకూరు 22. గుడ్లూరు 23. వోలేటి వారిపాలెం 24. కొన్నలూరి 25. కొండెపి 26. జరుగుమల్లి 27. సింగరాయకొండ 28. ఉలవపాడు 29. లింగసముద్రం 30. కనిగిరి 31. తిమ్మారెడ్డిపల్లి (కేంద్ర : హనుమంతునిపాడు) 32. పామూరు 33. వెలిగండ్ల 34. చంద్రశేఖరపురం 35. పెదచర్లపల్లి 36. పొదిలి 37. కొణకనమెట్ల 38. మర్రిపూడి 39. దర్శి 40. తాళ్ళూరు 41. ముందలమూరు 42. దొనకొండ 43. కురిచేడు 44. తర్లుపాడు 45. మార్కాపురం 46. దోర్నాల 47. పెద ఆరవీడు 48. యెర్రగొండ 49. త్రిపురాంతకం 50. పుల్లల చెఱువు 51. గిద్దలూరు 52. రాచర్ల 53. కొమరోలు 54. బెస్తవారిపేట 55. కంభం 56.అర్థవీడు.

**16.జిల్లా చరిత్ర :** గుంటూరు, నెల్లూరు, కర్నూలు, జిల్లాలకు చెందిన కొన్ని ప్రాంతాలను విడదీసి 1970లో ఒంగోలు జిల్లాగా ప్రభుత్వం ప్రకటించింది. ఆంధ్రకేసరి ప్రకాశం పంతులు ఈ జిల్లాకు చెందిన మహావ్యక్తి కావడంతో ఆయన స్మృత్యర్థం ప్రభుత్వం ఒంగోలు జిల్లాకు ప్రకాశం జిల్లా అని నామకరణం చేశారు.



## ప్రకాశం జిల్లాలోని దర్శనీయ స్థలాలు

**1.త్రిపురాంతకం :** మర్కాపురమునకు 40 కి.మీ. దూరములో త్రిపురాంతకంలో త్రిపురాంతకేశ్వర శివాలయం అమ్మవారు బాలత్రిపుర సుందరీ దేవి. స్వయంభూ లింగం కదంబవృక్షం కూడా వున్నది.

**2.సింగరకొండ :** కొండపైన లక్ష్మీనరసింహస్వామి ఆలయము కలదు. కొండ క్రింద అద్దంకికి 5 కి.మీ. దూరంలో ప్రసన్నాంజనేయస్వామి ఆలయం కలదు.

**3.మణికేశ్వరం :** అద్దంకి మండలములో గుండ్లకమ్మ నదీతీరాన శ్రీ గంగా భ్రమరాంబ సమేత మల్లేశ్వరస్వామి దేవాలయము కలదు. శివరాత్రి కార్తీక మాసంలో ఉత్సవాలు జరుగుతాయి. నది ఒడ్డున శ్మశానవాటిక ఉన్నందున దక్షిణ కాశి అయినది.

**4.మాలకొండ :**కందుకూరు నుండి 30 కి.మీ. మాల్యాద్రి లక్ష్మీ నరసింహస్వామి ఆలయము కలదు. ప్రతి శనివారం వేలాది మంది భక్తులు దర్శిస్తారు.

**5.భైరవ కోన :** పామూరుకు 42 కి.మీ. దూరములో అడవిలో అష్టముఖ భైరవస్వామి ఆలయము ఇచ్చట త్రిముఖదుర్గా మరియు జలపాతం కలదు. చంద్రశేఖరపురం మండలములో కొత్తపల్లి గ్రామానికి 5 కి.మీ. దూరములో వున్నది. శివరాత్రి నాడు వైభవముగా ఉత్సవములు జరుగుతాయి. ప్రకాశం – నెల్లూరు జిల్లాల సరిహద్దులో తూర్పుకనుమలకు దూరముగా సి.యస్.పురం మండలంలో అంబవరం కొత్తపల్లె గ్రామ సమీపములో భైరవకోన వున్నది. ప్రతి సంవత్సరం కార్తీక పౌర్ణమి రోజు రాత్రి 7-9 గం॥ల మధ్య దుర్గాదేవి ఆలయంలోకి చంద్ర కిరణాలు ప్రసరిస్తాయి.

**6.సింగరాయకొండ:** ఇచ్చట కొండమీద రెండు నరసింహాలయములు కలవు. అవి యోగానంద నరసింహ, వరహా నరసింహా ఆలయములు చెన్నై – విజయవాడ రోడ్డులో కలవు.

**7.మార్కాపురం :**ఒంగోలు నుండి 93 కి.మీ. దూరంలో వున్న మర్కాపురంలో చెన్నకేశవస్వామి ఆలయం చాలా విశేషమైన దేవాలయం. మరియు మార్కండేశ్వర స్వామి ఆలయం చూడదగినది. డిశంబరు 16వ తేది నుండి జనవరి 14వ తేది వరకు నెలరోజులు సూర్య కిరణాలు స్వామివారిపై ప్రసరిస్తాయి.

**8.నర్సింగోలు :** ఒంగోలు నుండి కందూకూరు వెళ్ళే దారిలో నర్సింగోలు గ్రామములోశని దేవాలయము కలదు. శనిత్రయోదశి దినము నందు అనేక మంది భక్తులు వస్తారు.

**9.ఒంగోలు :** ఒంగోలు పట్టణములో శ్రీసాయిబాబా దేవాలయం చాలా ప్రసిద్ధిచెందినది. ఇచ్చటనే ప్రముఖ ఆధ్యాత్మిక రచయిత పూజ్యశ్రీ ఆచార్య ఎక్కరాల భరద్వాజ వారి సమాధి మందిరము కలదు. శ్రీ కాశీ విశ్వేశ్వర, చెన్నకేశవస్వామి దేవస్థానములు కలవు.

**10.మిట్టపాలెం :** కనిగిరి నుండి సి.యస్. పురం వెళ్ళే దారిలో మిట్టపాలెం అనేగ్రామంలో శ్రీనారాయణస్వామి సమాధి మందిర దేవాలయము చూడదగినది.

ఇచ్చట అనేక మంది భక్తులు నిద్ర చేయటానికి వస్తారు. ప్రతి ఆదివారం అనేక మంది భక్తులు వస్తారు.

**11.అనుమల కొండ :** కనిగిరి నుండి సి.యస్. పురం వెళ్ళేదారిలో అనుమల కొండ దగ్గర శ్రీ శివారామబ్రహ్మంగారి సమాధి మందిరము చూడదగినది. శివరాత్రి పర్వదినము నందు ఉత్సవములు జరుగును.

**12.పెదగంజాం :** ప్రకాశం జిల్లాలోని పెదగంజాం భావన్నారాయణస్వామి దేవాలయమును దర్శించగలరు.

**13.చిన గంజాం :** ప్రకాశం జిల్లాలోని చినగంజాం భావన్నారాయణస్వామి దేవాలయమును దర్శించగలరు.

**14.పాదర్తి :** ప్రకాశం జిల్లాలోని పాదర్తి భావన్నారాయణస్వామి దేవాలయమును దర్శించగలరు.

**15.చందవరం :** గుండ్లకమ్మనదీ తీరం కొండమీద 30 అడుగులు ఎత్తుగల పవిత్రస్థూపం కలదు. త్రిపురాంతకం మండలంలో వెల్లంపల్లి గ్రామానికి 2 కి.మీ. దూరములో వున్నది. ఇచ్చట వున్న భౌద్ధారామం అతి పురాతనమైనది.

**16.చదలవాడ :** ఈ గ్రామములో పురాతనమైన ఆలయం లింగోద్భవస్వామి ఆలయము. ఇచ్చట గల ధ్వజస్తంభమును చూడవలసినదే. మరియు రఘునాయక స్వామి దేవాలయమును దర్శించగలరు. ఒంగోలు-చీరాల బస్సు మార్గములో ఒంగోలు నుండి 15 కి.మీ దూరములో వున్నది. కళ్యాణమునకు గరుత్మంతుడు తిలకించును.

**17.అద్దంకి :** ఇచ్చట కమండలేశ్వరస్వామి ఆలయము మరియు నగరేశ్వరస్వామి ఆలయము మరియు గుండ్లకమ్మ నదికి 1/2 కి.మీ. దూరములో రామలింగేశ్వరస్వామి ఆలయము చూడదగినది మరియు రంగనాయిక స్వామి దేవాలలయము వేంకటేశ్వరస్వామి దేవాలయము మరియు మాధవస్వామి ఆలయములు వైష్ణవి సంప్రదాయానికి చెందిన ఆలయములు.

**18.మార్కాపురం :** ప్రకాశం జిల్లాలోని మార్కాపురంలో మార్కండేశ్వర ఆలయం దర్శించదగినది. దీనిని మార్కండేయ ప్రతిష్ఠి అని చెప్పుదురు.

**19.చుండి :** ఈ గ్రామములో పరశురామ ప్రతిష్ఠ అయిన శివాలయము కలదు. దగ్గరలో అభయ ఆంజనేయ స్వామి విగ్రహము మరియు శిధిలమయిన రామాలయము కనపడును.

**20.కనపర్తి :** నాగులుప్పలపాడుకు 15 కి.మీ. దూరములో వున్న ఈ గ్రామం సముద్ర తీరంలో వున్నది. ఇచ్చట పురాతనమైన ఆలయం కలదు. ఈ ఆలయం శైవ క్షేత్రముగా పేరుగాంచినది.

**21.వీరమేడపి :** పలనాటి బ్రహ్మనాయుడు నిర్మించిన చెన్నకేశవ ఆలయం దర్శించదగినది. త్రిపురాంతకానికి 10 కి.మీ దూరములో వున్నది.



**22.మొగిలిచర్ల :** కందూకూరుకు 40 కి.మీ. దూరములో మాలకొండకు 5 కి.మీ. దూరములో వున్నా మొగిలిచర్లలో దత్తాత్రేయస్వామి దేవాలయం చూడదగినది. స్వామి వారి సమాధి మందిరము కలదు.

**23. గొట్రాలి కొండ :** పెద్దారవీడు మండలములో రాజంపల్లె గ్రామానికి దగ్గరగా వున్న గొట్రాలి కొండలో సంతానమును ప్రసాదించే ఆలయం ఎక్కువగా సంతానము లేనివారు దర్శిస్తూంటారు. స్వామి వారు శ్రీ తిరుమలనాథస్వామి.

**24.వల్లూరు :** ఒంగోలుకు 5 కి.మీ. దూరములో వున్న వల్లూరులో వల్లూరమ్మ దేవాలయంను ఎక్కువగా ఆదివారం నాడు భక్తులు దర్శిస్తారు. ఆమెనే ఉల్లలమ్మ, వల్లూరమ్మ అని పిలుస్తారు.

**25.కురిచేడు :** చాలా పురాతన దేవాలయం శ్రీదేవి భూదేవి సమేత లక్ష్మీ కొన వల్లభరామస్వామి ఆలయం చూడదగినది.

**26.కంభం :** కంభంలోని సత్యమాంబ దేవాలయం ఆదివారం భక్తులు ఎక్కువ మంది దర్శిస్తారు. నవరాత్రి ఉత్సవములు వైభవముగా చేస్తారు.

**27.ఉప్పుటూరు :** చోళరాజులచే నిర్మించబడిన వేంకటేశ్వర ఆలయంలో చెన్నకేశవ స్వామి కాశీవిశ్వేశ్వర స్వామి వార్లు కూడ వున్నారు.

**28.మల్లవరం :** మద్దిపాడు మండలంలో గుండ్లకమ్మ నదీ తీరాన మల్లగిరిపై శ్రీ వేంకటేశ్వర స్వామి దేవాలయము చాలా పురాతనమైనది.

**29.ఇక్షుపురి :** ఏర్పూరు మండలం చేరుకూరు గ్రామంలో ఇక్షుపురి ఆలయంలోని అగస్త్యేశ్వరస్వామి అగస్త్యముని ప్రతిష్ఠ.

**30.పాలంకతీర్థం :** ఎర్రగొండ పాలెం మండలం పాలుట్ల దగ్గరలో కృష్ణానదీ తీరాన నల్లమల అభయారణ్యంలో కొండచరియ క్రింద శ్రీశైలం క్షేత్ర పరిధిలో పాలంకేశ్వర క్షేత్రం వున్నది. నల్లమల అడవులలో నడచి నదీ తీరాన వున్న పాలాటం కోట మీదగా 8 కి.మీ. నడచి పాలంక తీర్థం చేరుకోవాలి. స్వామి పాలంకేశ్వరుడు ప్రతినం॥ ఏకాదశి, ద్వాదశి రోజులలో తిరునాళ్ళ జరుగుతుంది.

**31.పాలంకేశ్వర తీర్థం :** ఎర్రగొండపాలెంకు 50 కి.మీ దూరములో వున్నది. 100 అడుగుల ఎత్తుగల కొండపైభాగం నుండి గుండంలో సేలంకురులో జలపాతం పడుతుంటుంది. ఈ పాలంకేశ్వర దేవాలయం ఒక పెద్దకొండ చరియ క్రింద ఒదిగి వుంది.

**32.కందుకూరు :** కందుకూరులో బ్రహ్మేశ్వర స్వామి దేవాలయమును దర్శించగలరు.

**33.గుండ్ల బ్రహ్మేశ్వరం :** గుండ్ల బ్రహ్మేశ్వరంలో గుండ్ల బ్రహ్మేశ్వరంస్వామి ఆలయమును చూడగలరు.

**34.పొదిలి :** ఇచ్చట గల నిర్మలేశ్వర స్వామి ఆలయం దర్శించగలరు. 3 ఎకరములలో 5 శివాలయములు గలవు.

**35.గిద్దలూరు :**ఇచ్చట గల పాతళ నాగేశ్వరస్వామి మరియు నీలకంఠేశ్వర స్వామి ఆలయం దర్శించగలరు. స్వర్ణబాహు నదీ తీరమున ఉన్నది.

**36.మోక్షగుండగ్రామం** : ఈ గ్రామములో ఉండే గుండంలో మునిగితే మోక్షం లభిస్తుంది. ఇక్కడకు 2 కి.మీ. దూరంలో తూర్పు కొండలోయలో ముక్తేశ్వర క్షేత్రం కలదు. వశిష్ఠ మహాముని శివలింగము ప్రతిష్ఠ చేసినారు.

**37.ఉమామహేశ్వరపుర అగ్రహారం:**ఇచ్చట గల శివాలయము చాలా పురాతనమైనది. శ్రీ మహాలక్ష్మమ్మ చెట్టు వద్ద తిరునాళ్ళు జరుపుతారు.

**38.తురిమెళ్ళ** : తురిమెళ్ళ గ్రామానికి 2 కి.మీ దూరములో కనకసుభేశ్వరాలయం కంభం మండలంలో వున్నది. దీనిని జమదగ్ని క్షేత్రం అని అంటారు. మహాశివరాత్రి నాడు ఉత్సవాలు జరుపుతారు.

**39.కోటిలింగాలగుట్ట** : శ్రీ కనక సురభేశ్వర కోనలోని పాపేశ్వరుని సమీపములో కనిపించే లింగాలను కోటిలింగాల గట్టు అని అంటారు. పాపేశ్వరుని ఆలయమునకు తూర్పు ద్వారం ముందు వున్న నంది విగ్రహం చూడవలసినదే.

**40.త్రివేణి సంగమం** : సురభేశ్వర కోనను ఆనుకొని గుండ్లకమ్మనది, లోతువాగు, ఎర్రవాగు అను మూడు నదులు రెండు కొండల నడుమ సంగమమై త్రివేణీ సంగమము ప్రవహిస్తుంది. మహాశివరాత్రినాడు ఉత్సవాలు జరుపుతారు.

**41.సత్యవోలు** : గిద్దలూరుకు 7 కి.మీ దూరములో వున్న ఈ గ్రామములో రామలింగేశ్వరస్వామి ఆలయం చాలా ప్రాచీనమైనది.

**42.చీమకుర్తి** : ఒంగోలు నుండి శ్రీశైలము పోవుదారిలో ఒంగోలుకు 25 కి.మీ దూరములో శ్రీ మోక్షరామలింగేశ్వర స్వామి దేవాలయము కలదు. దేవాలయ ఈశాన్యమున గంగాదేవి దేవాలయము కలదు. చైత్రపూర్ణిమ గంగాదేవి జాతర జరుగును. పార్వతి అమ్మవారు దక్షిణ ముఖి అయి వెలసినది.

**43.మోటుపల్లి** : ఇచ్చట శిధిలమైన భౌద్ధ స్థూపాలు చూడగలరు. మోటుపల్లి వీరభద్రస్వామి చాలా ప్రఖ్యాతి గాంచిన దేవుడు. మోటుపల్లిని ఒకప్పుడు కాసులదిబ్బ అనేవారు.

**44.కనిగిరి దుర్గం** : కాటమరాజు కాలంనాటి శిల్పాలు, విగ్రహాలు, దేవాలయాలు శిధిలమైనవి దర్శించగలరు.

**45.తాళ్ళూరు** : ప్రతి సంవత్సరం లక్షలాది ప్రజలు విచ్చేసే గుంటిగంగ తిరునాళ్ళు చాలా ప్రసిద్ధమైనది. పూర్వము ఋషులు గుంటిగంగలో స్నానం చేసి శివాలయము పూజలు చేసేవారని ప్రతీతి. ఇది సోమవరప్పాడు పంచాయితీ పరిధిలో ఉన్నది.





## 8. నెల్లూరు జిల్లా

**1. వైశాల్యం** : 13,076 చ.కి.మీ.
**2. జనాభా** : 30,00,000
**3. అక్షరాస్యత** : కృష్ణా, గుంటూరు జిల్లాలతో పోటీపడేలా ఇక్కడవెలసిన ప్రయివేటు విద్యాసంస్థలు బాగా కృషిచేశాయి. 56%
**4. మండలాలు** : 46 (945 గ్రామాలు)
**5. నదులు** : పెన్నానది, సర్వముఖి, తదితర ఏరులు
**6. అడవులు** : 20% అటవీ ప్రాంతం. (అటవీ రక్షణ బాగా అమలవుతున్నది)
**7. పంటలు** : వరి, మిరప, వేరుశెనగ, నువ్వులు, రాగులు, కాయగూరలు
**8. ఖనిజాలు** : సిలికాన్, మైకా, క్వార్ట్జ్, గార్నెట్
**9. పరిశ్రమలు** : చేనేత, రొయ్యలు, బ్యాటరీ, రసాయనాలు, పేపరు పరిశ్రమలున్నాయి.
**10. విజయవాడ నుండి ఈ జిల్లాలోని ముఖ్యప్రాంతాలకు గలదూరం (కి.మీ.లలో)**

| పట్టణం/నగరం | దూరం | పట్టణం/నగరం | దూరం |
|---|---|---|---|
| గూడూరు | 40 కి.మీ. | వెంకటగిరి | 90 కి.మీ. |
| శ్రీహరికోట | 120 కి.మీ. | కావలి | 55 కి.మీ. |
| నాయుడుపేట | 70 కి.మీ. | సూళ్లూరుపేట | 100 కి.మీ. |
| పొదలకూరు | 36 కి.మీ. | | |

**11. సరిహద్దులు** : తూర్పు - బంగాళఖాతం, ప॥గో॥జిల్లా
పశ్చిమ - గుంటూరు జిల్లా
ఉత్తరం - ఖమ్మం జిల్లా
దక్షిణం - బంగాళఖాతం
**12. ముఖ్యకేంద్రం** : మచిలీపట్నం
**13. రైల్వేస్టేషన్** : విజయవాడ

**14.ప్రధాన పట్టణాలు** : నెల్లూరు, కావలి, గూడూరు, సూళ్ళూరుపేట, వెంకటగిరి, కోవూరు, నాయుడుపేట,

**15.మండలాలు(46) :**1. సీతారామపురం 2. ఉదయగిరి 3. వరికుంటపాడు 4. దుత్తలూరు 5. మర్రిపాడు 6. వింజమూరు 7. కలిగిరి 8. కొండాపురం 9. కావలి 10. జలదంకి 11.బోగోలు 12. కోవూరు 13. కొడవలూరు 14. విడవలూరు 15. దగదర్తి 16. అల్లూరు 17. బుచ్చిరెడ్డిపాలెం 18. సంగం 19. ఆత్మకూరు 20. హనుమసముద్రం పేట 21. అనంతసాగరం 22. ఇందుకూరు పేట 23. తోటపల్లి గూడూరు 24. నెల్లూరు 25. వెంకటాచలం 26. ముత్తుకూరు 27. పొదలకూరు 28. చేజర్ల 29. కలువాయి 30. వాకాడు 31. సైదాపురం 32. గూడూరు 33.

మనుబోలు 34. చిల్లకూరు 40. ఓజిలి 41. సూళ్లూరుపేట 42. దొరవారి సత్రం 43. తడ 44. వెంకటగిరి 45. బాలాయపల్లి 46. డక్కిలి.

**16.జిల్లా చరిత్ర :** పల్లవులు, తూర్పు చాళుక్యులు, రెడ్డి రాజులు, తెలుగు చోళులు, విజయనగర రాజులు పాలించిన నెల్లూరు జిల్లాకు విస్తారమైన చరిత్ర ఉంది. స్వాతంత్ర్యానికి ముందు విక్రమసింహపురంగా పిలవబడిన ఈ ప్రాంతానికి పొరుగునే ఉన్న తమిళనాడు ద్రావిడ భాష ప్రభావంతో నెల్లూరు జిల్లాగా పేరు స్థిరపడింది. కవిత్రయాల్లో ఒకరైన తిక్కన సోమయాజి నెల్లూరుకు చెందినవాడు. ఉత్తరాది, దక్షిణాది, రైల్వే రూట్‌లో ప్రధాన రైల్వే జంక్షన్, కావలి, కొమరపల్లి, సూళ్లూరుపేట, నాయుడు పేట ప్రధాన పట్టణాలు.

## నెల్లూరు జిల్లాలోని దర్శనీయ స్థలాలు

**1.నెల్లూరు :** పెన్నానది ఒడ్డున తల్పగిరి రంగనాథస్వామి ఆలయం ప్రసిద్ధి చెందినది. అంతేగాక మూలస్థానేశ్వరస్వామి, వేణుగోపాలస్వామి, ధర్మరాజు ఆలయం చూడదగినవి. సంతపేట శ్రీసాయిబాబా దేవాలయం మరియు మూలపేట శ్రీ వెంకయ్య స్వామివారి దేవస్థానం కూడ చూడదగినవి. మూలపేట వినాయకుని చూడగలరు. దర్గామెట్టలోని రాజరాజేశ్వరీ ఆలయం దర్శించగలరు. చెరువు గట్టున ఇరుగమ్మ దేవాలయం చూడగలరు.

**2.గొలగమూడి :** నెల్లూరు సుమారు 30 కి.మీ. దూరములో గొలగమూడి వెంకయ్య స్వామివారి సమాధి మందిరము చాలా ప్రసిద్ధి చెందినది. ప్రతి ఒక్కరూ చూడదగినవి. శనివారం రోజున ఎక్కువ మంది భక్తులు దర్శిస్తారు.

**3.జొన్నవాడ :** నెల్లూరు సుమారు 25 కి.మీ. దూరంలో వున్న జొన్నవాడ కామక్షి తప్పక ప్రతి ఒక్కరూ చూడదగినది. శుక్రవారం ఎక్కువ మంది వస్తారు.

**4.పెంచలకోన :**నెల్లూరు 50 కి.మీ. దూరములో పెనుశిల లక్ష్మినరసింహస్వామి (స్వయంభూ) అత్యంత శక్తివంతమైన క్షేత్రము. రాపూరు మండలములో గోనుపల్లికి 7 కి.మీ దూరములో కలదు. శనివారం రోజున ఎక్కువమంది దర్శిస్తారు.

**5.వాడరేవు :** సముద్రతీరము విహర యాత్రలు కార్తీకమాసంలో జనులు వస్తుంటారు.

**6.ఉదయగిరి :**నెల్లూరు 98 కి.మీ.దూరంలో ఉన్న ఉదయగిరి దుర్గం చూడదగినది.

**7.శ్రీహరికోట :**నెల్లూరు జిల్లా సూళ్ళూరు పేటకు దగ్గర శ్రీహరికోట రాకెట్ ప్రయోగ కేంద్రము.

**8.వెంకటగిరి :** శ్రీకాళహస్తికి 25 కి.మీ. దూరములో వున్న కాశీవిశ్వేశ్వరస్వామి, విశాలాక్షి దేవాలయం కలదు. ఆలయ ఆవరణలోనే మాతృభూతేశ్వరాలయం, వినాయకుని గుడి కలవు. చేనేత వస్త్రాలకు ప్రసిద్ధి చెందినది.



**9.బుచ్చిరెడ్డిపాలెం :** నెల్లూరుకు 16 కి.మీ. దూరంలో పెన్నానదితీరంలో శ్రీకోదండ రామస్వామి దేవాలయం కలదు. మరియు లక్ష్మీ నరసింహస్వామి దేవాలయము దర్శించగలరు.

**10.భైరవ కొండ :** ఉదయగిరికి 40 కి.మీ. దూరములోని భైరవకొండలో భైరవుడిన్ని దర్శించగలరు.

**11.ప్రభాగిరి పట్నం:**ఇచ్చట గల చెన్నకేశవస్వామి దేవాలయం చూడదగినది.

**12.పెనుశిల:**ఇచ్చటగల ఛత్రవటి నరసింహస్వామి దేవాలయం చూడగలరు.

**13.సూళ్ళూరుపేట :** ఇచ్చట గల చెంగాలమ్మ దేవాలయం దర్శించగలరు. ప్రాచీన దేవాలయము.

**14.మన్నారు పోలూరు :**ఎక్కడ లేని ఆలఘుమన్నారు దేవాలయం దర్శించదగినది.

**15.సంగం :** నెల్లూరు 30 కి.మీ సంగం మూడు నదులు సంగమ స్థలిలో సంగమేశ్వర ఆలయం చూడదగినది. 1.5 మీటర్లు ఎత్తుగల నందిని చూడగలరు.

**16.నెల్లూరు(దర్గామెట్ట) :** నెల్లూరులో దర్గామెట్టలో రాజరాజేశ్వరీ ఆలయము చూడదగినది. చెఱువుగట్టుపైన ఇరుగమ్మ ఆలయము మరియు మూల స్థానేశ్వరస్వామి ఆలయం దర్శించగలరు. అయ్యప్ప గుడిని దర్శించగలరు. యజ్ఞవల్క్యుని ఆలయం కూడా దర్శించగలరు.

**17.రామతీర్థం :** ఈ గ్రామములో రామలింగేశ్వరస్వామిని శ్రీరామచంద్రులు వారి ప్రతిష్ఠి అని భక్తులు అర్చనలు చేయుదురు. నెల్లూరుకు 2 కి.మీ దూరములో ఉన్నది.

**18.నరసింహులుకొండ :** నెల్లూరుకు 5 కి.మీ. దూరములో పెన్నానది ఒడ్డున ఈ కొండ వున్నది. ఇచ్చట గల నరసింహ స్వామి ఆలయం వున్నది. దీనినే "వేదాద్రి నరసింహాలయము, గుట్టమీద నరసింహాలయము" అని అంటారు.

**19.నేటపట్టి :** పులికాట్ సరస్సుకు 20 కి.మీ. దూరములో వున్న ఈ ప్రదేశము వేలాది పక్షులు విడిది చేసే ప్రదేశము.

**20.పులికాట్ సరస్సు :**460 కి.మీ. విస్తీర్ణముతో దేశంలో అతి పెద్దదైన రెండవ ఉప్పు నీటి సరస్సు.

**21.కృష్ణాపట్నం :** నెల్లూరుకు 25 కి.మీ. దూరములో కృష్ణా పట్నం ఓడరేవు చాలా ప్రసిద్ధి చెందినది. ఇచ్చట గల వేణుగోపాల స్వామి ఆలయం చూచి తీరవలసినదే.

**22.ఉదయగిరి దుర్గం :** నెల్లూరుకు 100 కి.మీ. దూరములో వున్న ఉదయగిరి దుర్గం 35 కి.మీ. విస్తరించి వున్నది. ఇచ్చట అనేక దేవాలయములు వున్నవి. దుర్గము దర్శించేదుకు ఘాట్ రోడ్డు నిర్మాణము చేసియున్నారు.

**23.సిద్ధులయ్యకొండ :** సైదాపురం సమీపములో సిద్ధులయ్య కొండలో వున్న జైన మునుల విగ్రహములు దర్శించదగినది.

**24.నవాబుపేట :** ఇచ్చట గల మల్లేశ్వరస్వామి దేవాలయం దర్శించగలరు.

**25.కస్మూరు :**కస్మూరు కాలేషా దర్గాను దర్శించగలరు.

**26.కొత్తపల్లి :**నెల్లూరు జిల్లాలో కొత్తపల్లి దగ్గరున్న భైరవకోన పర్వతారణ్యముల మధ్య ఉన్నది. ఈ కోనయందు గల గుహలలో ఒకదానియందు భైరవ విగ్రహ ముండుటచే ఈ కోనకు భైరవకోన అను పేరు వచ్చినది. ఇచట పార్వతీమాత ఆలయం కలదు.

**27.వేంకటేశ్వర పాలెం :** నెల్లూరు-కావలికి మధ్యన బిట్రగుంటకు 3 కి.మీ దూరములో వేంకటేశ్వరపాలెం రైల్వేస్టేషన్‌కు 1 కి.మీ దూరములో ప్రసన్న వేంకటేశ్వరాలయము వున్నది. దీనినే బిలకూటక్షేత్రం అని అంటారు. పాసింజర్ రైళ్ల మాత్రమే యిక్కడ ఆగుతాయి.

## 10. అనంతపురం జిల్లా



| | | |
|---|---|---|
| 1. | **వైశాల్యం** | : 19,130 చ.కి.మీ. |
| 2. | **జనాభా** | : 35,60,000 |
| 3. | **అక్షరాస్యత** | : 48% |
| 4. | **నదులు** | : పాపఘ్ని, హగరి, చిత్రావతి, పెన్నా |
| 5. | **అడవులు** | : 10% |
| 7. | **పంటలు** | : కొర్రలు, జొన్న, వేరుశనగ, రాగులు వంటి మెట్టపంటలు. |
| 8. | **ఖనిజాలు** | : కోరండమ్, బాక్సయిట్, వజ్రాలు, సున్నపురాయి, తదితర వెలికిరాని ఖనిజాలు |
| 9. | **పరిశ్రమలు** | : 33 మధ్య, చిన్నతరహా పరిశ్రమలు పంచదార, జౌళి పరిశ్రమలు, ధర్మవరం చీరలు |

**10. అనంతపురం నుండి వివిధ ప్రాంతాలకు గలదూరం (కి.మీ.లలో)**

| పట్టణం/నగరం | దూరం | పట్టణం/నగరం | దూరం |
|---|---|---|---|
| రాయదుర్గం | 86 కి.మీ. | పుట్టపర్తి | 98 కి.మీ. |
| హిందూపురం | 115 కి.మీ. | మడకసిర | 110 కి.మీ. |
| ధర్మవరం | 48 కి.మీ. | | |

**11. సరిహద్దులు :** తూర్పు - కడప జిల్లా
పశ్చిమ - కర్ణాటక రాష్ట్రం
ఉత్తరం - కర్నూలు జిల్లా
దక్షిణం - చిత్తూరు జిల్లా



**12. ముఖ్యకేంద్రం :** అనంతపురం

**13. రైల్వేస్టేషన్ :** గుంతకల్ రైల్వే జంక్షన్

**14.ప్రధాన పట్టణాలు:**కళ్యాణదుర్గం, రాయదుర్గం, ఉరవకొండ, గుత్తి, సింగనమల, అనంతపురం, తాడిపత్రి, పుట్టపర్తి, ధర్మవరం.

**15.మండలాలు(63) :** 1. అనంతపురం 2. రప్తాడు 3. గార్లదిన్నె 4. ఆత్మకూరు 5. కుదేరు 6. సింగనమల 7. బుక్కరాయ 8. నార్పల 9. తాడిపత్రి 10. యాడికి 11. పెదపప్పూరు 12. పుట్లూరు 13. ఎల్లనూరు 14. గుంతకల్లు 15. గుత్తి 16. పామిడి 17. కిష్టిపాడు 18. ఉరవకొండ 19. వజ్రకరూర్ 20. విదపాసకాలు 21. ధర్మవరం 22. తాడిమర్రి 23. బత్తలపల్లి 24. చెన్నేకొత్తపల్లి 25. కనగానపల్లి 26. రామగిరి 27. కళ్యాణదుర్గం 28. బేలుగుప్ప 29. కంబదూరు 30. కుందిర్తి 31. బ్రహ్మసముద్రం 32. సెత్తూరు 33. రాయదుర్గ 34. బొమ్మన హాల్ 35. గుమ్మగట్ట 36. కనెకల్ 37. బొమ్మనకల్ 38. పెనుకొండ 39. సోమన్‌దేపల్లి 40. రొద్దమ్ 41. పుట్టపర్తి 42. కొత్తచెఱువు 43. బుక్కపట్నం 44. మడకశిర 45. అమరాపురం 46. గుదిబండ 47. రోళ్ళ 48. ఆగలి 49. హిందూపురం 50. పరిగి 51. లేపాక్షి 52. తలుపురి 59. నల్లచెఱువు 60. ఓబులదేవర చెఱువు 61. తనకల్ 62. అమడగూరు 63. గండ్లపెంట.

**16.జిల్లా చరిత్ర :** బ్రిటిష్ పాలకుల కాలంలో రతనాల సీమ అయిన రాయలసీమలో అనంతపురంను ప్రత్యేక ప్రాంతంగా గుర్తించి 1882లో జిల్లాగా ఏర్పాటుచేశారు. విజయనగర సామ్రాజ్యంలో ప్రధాన భాగమైన ఈ ప్రాంతం తుంగభద్ర నదీ పరివాహక ప్రాంతం కావడం వల్ల వ్యవసాయము ప్రధాన ప్రాంతమైంది. అయితే వర్షాభావానికి తోడు, ప్రకృతి సంపద కొల్లగొట్టబడటంతో కరువు ప్రాంతంగా మారిపోయింది. పట్టు పరిశ్రమ, పండ్లతోటల, హస్తకళ జనం వలస పోకుండా జీవనం సాగిస్తున్నారు. లేపాక్షి హస్తకళ అంతర్జాతీయ ప్రాముఖ్యత పొందింది. సత్యసాయిబాబా కారణంగా పుట్టపర్తి ఆధ్యాత్మిక, వైద్య, విద్యా కేంద్రంగా పేరుపొందింది.

## అనంతపురం జిల్లాలోని దర్శనీయ స్థలాలు

**1.కటారుపల్లె :**కదిరికి దగ్గరలో ఉన్న ఈ గ్రామములో యోగివేమన సమాధి మందిరం కలదు.

**2.తాడిపత్రి :** అనంతపురమునకు 40 కి.మీ. దూరంలో ఉన్న తాడిపత్రిలో చింతల రామస్వామి దేవాలయము చాలా ప్రాచీనమైనది. పెన్నా నది ఒడ్డున బుగ్గా రామలింగేశ్వరస్వామి దేవాలయం చూడదగినది.

**3.ఎనుమలదొడ్డి :** పవిత్రమైన జలాలతో భక్తులను ఆకర్షించే ప్రదేశం.

**4.ధర్మవరం :** అనంతపురం 37 కి.మీ. దూరంలో గల ధర్మవరంలో శ్రీ లక్ష్మీచెన్నకేశవ స్వామి ఆలయము మరియు రామలింగేశ్వర స్వామి దేవాలయము

చూడదగినది. ఇక్కడి మండపంలోని 7 స్థంబాలపై ఏ వస్తువునైనా శబ్దం చేస్తే సప్తస్వరాలు వినవచ్చును.

**5.పుట్టపర్తి :** అనంతపురానికి 60 కి.మీ. దూరంలో ఉన్న పుట్టపర్తిలో గల ప్రశాంతి నిలయము నందు గల శ్రీ సత్యసాయిబాబా వారిని దర్శించవచ్చును. పుట్టపర్తిలోని ప్రశాంతి మందిరము నందు శ్రీ సత్యసాయిబాబా వారిని దర్శించగలరు. ఇచ్చట గల వైద్యసదుపాయములు మరెక్కడనూ లేవు. ఇచ్చట గల సత్యభామ దేవాలయం దర్శించగలరు.

**6. పెనుగొండ :** హిందూపురానికి 20 కి.మీ. దూరంలో ఉన్న పెనుగొండలో కోట బాబయ్య దర్గా చూడదగినవి. మరియు శ్రీరామ దేవాలయము చూడదగినవి. కదిరి పట్టణానికి 30 మైళ్ళ దూరములో వున్నది. ఆలయంలో సుందరమైన గరుడ విగ్రహం ఉన్నది. ఈ దుర్గం ప్రాంగణంలో 360 దేవాలయాలు ఉండేవని ప్రతీతి. ఇచ్చట గగన్‌మహల్, బాబయ్య దర్గా చూడదగినవి.

**7. లేపాక్షి :** ఇచ్చట అనేక శిల్పకళలు చూడదగినవి ఉన్నాయి. అంతేకాక వీరభద్రేశ్వర స్వామి విగ్రహము మరియు అతిపెద్ద నంది ప్రతి ఒక్కరూ చూసితీరవలసినదే. 30 అడుగులు వెడల్పు 20 మీటర్లు ఎత్తు వుంటుంది.

**8. తిమ్మమ్మ మర్రిమాను :** ఈ గ్రామములో అతిపెద్ద మర్రి చెట్టుకలదు. కదిరి నుండి 24 కి.మీ. దూరములో వున్నది. ఈ మర్రిమాను 600 సం॥ క్రితం అని చెబుతారు.

**9.ఆలూరు :**ఇచ్చట రంగనాధ స్వామి ఆలయమును, మరియు చిన్న జలపాతమును, మరియు ప్రకృతిసౌందర్యమును ఆహ్లాద కరముగా చూడవచ్చును.

**10. ఆత్మకూరు :** అనంతపురానికి 25 కి.మీ. దూరంలో ఉన్న నరసింహా స్వామి వారి దేవస్థానమును ప్రతిఒక్కరూ చూడదగినది. పురాతన రోమన్ కేథలిక్ చర్చి చూడదగినది.

**11. కదిరి :** ఇచ్చట గల శ్రీ నృసింహస్వామి దేవాలయం దర్శించదగినది. పురాతన వైష్ణవ క్షేత్రం చెంచులక్ష్మీదేవి అమ్మవారిని కూడా దర్శించగలరు. హిందూపురానికి తూర్పుదిశలో కడపజిల్లా సరిహద్దులో వున్నది.

**12. పామిడి :** పెన్నా నదీతీరాన పామిడి గ్రామమునందు ప్రాచీన శివాలయం కలదు. స్వామి వారి పేరు భోగేశ్వరస్వామి. లింగము త్రిలోచన రూపములో కనపడును.

**13. అనంతపురం :** అనంతపురంలో పాతూరు నందు విరుపాక్షేశ్వర స్వామి ఆలయం మరియు నాగరేశ్వర స్వామి ఆలయము కలదు. ఇచ్చట కాశీవిశ్వే శ్వరస్వామి ఆలయము, మరియు కోదండ రామాలయము చూడదగినవి. మరియు చెన్నకేశవస్వామి ఆలయము.

**14. బుక్కరాయి చెఱువు :** ఈ చెఱువు సమీపములో గణపతి, అయ్యప్ప, సాయిబాబా, ఆంజనేయ ఆలయములు ఎన్నో కలవు. గణపతి, ఆంజేస్వామి



ఆలయములు పురాతనమైనది. కాశీవిశ్వేశ్వర ఆలయము చాలా ప్రాచీనమైనది. అమ్మవారు కాశీవిశాలాక్షి.

**15. రత్నగిరి :** ఇచ్చట మల్లికార్జున ఆలయము రాజులచే కట్టించబడినది. రత్నగిరి నందు కొల్లాపుర మహాలక్ష్మి దేవాలయము దర్శించగలరు. రత్నగిరి సమీపమున కర్నాటక రాష్ట్రమునకు సరిహద్దులోని హేమవతి నగరములో సిద్ధేశ్వరాలయము, దొడ్డేశ్వరాలయం, మల్లేశ్వరస్వామి వారి ఆలయము, విరుపాక్షీశ్వరాలయం అను పేర్లు గల మరి మూడు ఆలయములు కలవు.

**16. కాసాపురం :** గుంతకల్లు సమీపంలో కాసాపురం గ్రామం వద్ద వ్యాసరాయ ప్రతిష్ఠ నెట్టికంటి ఆంజనేయస్వామి దేవాలయం ప్రతి ఒక్కరు చూడదగినది.

**17. నెమళ్ళపల్లె :** పామిడి మండల కేంద్రమునకు 10 కి.మీ. దూరములో నెమళ్ళ పల్లె గ్రామంలో ఆంజనేయస్వామిని సంజీవరాయుడు అని పిలుస్తారు.

**18. గొరంట్ల :** హిందుపురం నుండి కదిరి మార్గములో గొరంట్ల గ్రామంలో చిత్రావతీ నదీ తీరంలో మాధవరాయ ఆలయం చూడదగినది. కదిరి పట్టణానికి 30 మైళ్ళ దూరములో వున్నది. ఆలయంలో సుందరమైన గరుడ విగ్రహం ఉన్నది.

**19. అనంతపురం :** ఇచ్చట గల కాశీ విశ్వేశ్వరస్వామి పాతూరునందు విరూపాక్షేశ్వరస్వామి, పాతూరు నందు నగరేశ్వర స్వామి ఆలయములు దర్శించగలరు మరియు కన్యకా పరమేశ్వరీ అమ్మవారిని దర్శించగలరు. మరియు రామాలయం దర్శించగలరు. మరియు లక్ష్మీచెన్నకేశవాలయము పాతూరు నందు దర్శించగలరు.

**20. భం భం స్వామిదర్గా :** రాయదుర్గానికి 2 కి.మీ. దూరములో భం భం స్వామి దర్గా అందరు దర్శించదగినది.

**21. సిద్ధేశ్వర ఆలయం :** రాయదుర్గా నుండి బళ్లారి మార్గములో రాజ విద్యాశ్రమంలో జలసిద్ధేశ్వర సరస్వతీ స్వాముల సమాధి పైన రస లింగము ప్రతి ఒక్కరు చూడదగినది.

**22. నాగ సముద్రం :** గుత్తికి 20 కి.మీ. దూరములో నాగ సముద్రంలో చేదేశ్వరీ దేవాలయం దర్శించదగినది.

**23. గుత్తిదుర్గం :** గుత్తి దుర్గం చాలా పురాతన మరియు 303 మీ॥ ఎత్తైన దుర్గం. కోట ముఖ ద్వారంలో శ్రీ నగరేశ్వర స్వామి ఆలయం చూడదగినది. థామస్ మన్రో కట్టించిన సత్రం చూడదగినది. ఇచ్చటగల శ్రీసీతారామాలయం దర్శించగలరు. కదిరికి సమీపములో గుత్తిబైలు గ్రామములో తిమ్మమ్మ మర్రిమాను ఆసియా మర్రిచెట్టు ఆసియా ఖండంలోనే పెద్దదైన మర్రిచెట్టు.

**24. రాయదుర్గం :** ఇచ్చట గల దశభుజ గణపతి దేవాలయంలో 15 అడుగుల ఎత్తుగల ఒకేరాతిపై (కుడివైపు తిరిగిన తొండంతో) గణపతిని మలచినారు. అదే ప్రాంగణంలో లక్ష్మీనరసింహస్వామి దేవాలయం కూడా ఉన్నది. రాయదుర్గానికి 3 కి.మీ. దూరములో లింగాల బండ అనే గుట్టపై పశుపతి నాధ ఆలయం వున్నది.

రాయదుర్గం కోటలో మాధవ రామస్వామి, కోదండరామస్వామి ఆలయం భైరవ ఆలయం చూడదగినది. శ్రీ కృష్ణ దేవాలయాలు విడిది కేంద్రం. తిరుమల ఆలయమును పోలిన ఒక శివాలయం ప్రఖ్యాతమైనది. దేవాలయ శిఖరం చందన కర్రతో తయారు చేయబడినది.

**25. హిందుపురం :** హిందుపురంలో నూగూరు ఆంజనేయస్వామి దేవాలయము దర్శించగలరు.

**26. సోమపాలెం :** ఇచ్చటగల కొత్తమ్మ గుడిని దర్శించగలరు.

**27. అలూరుకోన :** తాడిపత్రికి 11 కి.మీ. దూరాన గల కొండపై బుక్కరాయలు నిర్మించిన రంగనాథ ఆలయం దర్శించదగినది. ఈ ప్రదేశములో అందమైన జలపాతం వున్నది.

**28. తాడిమర్రి :** ఇచ్చటగల చెన్నకేశవస్వామి దర్శించగలరు.

**29. కొనకండ్ల :** గుంతకల్లుకి 6 కి.మీ దూరంలో ఉన్న ప్రాచీన జైన తీర్థం. జంబూద్వీప చక్రం,(బండరాతిపైబడినది) చూడదగినవి.

**30. వీరాపురం :** ఇచ్చట వలస పక్షుల కేంద్రం కలదు.

**31. కొత్తచెరువు :** చాలా ప్రాచీనమైన సోమేశ్వరాలయం కలదు. ఈ ఆలయంలో 400 కిలోల బరువు గల "ధర్మగంట" వున్నది. రాయలసీమలో యింత పెద్ద గంట మరెచ్చటనూ లేదు.

**32. గూగూడు :** నార్పల మండలంలో ఉన్న ఈ గ్రామంలో కుళ్ళాయిస్వామి, ఆంజనేయస్వామి, హిందూ,ముస్లిమ్ దేవాలయాలు ప్రక్కప్రక్కనే గలవు.

**33. పెన్నఆహోబిలం :** అనంతపురానికి 36 కి.మీ దూరంలో ఉన్న ఈ గ్రామంలో లక్ష్మీనృసింహస్వామి ఆలయం చూడదగినది.

**34. రత్నగిరిక :** ఈ గ్రామములో మడకశిరకు కొద్ది దూరములో కలదు. ఇచ్చట సనాతన స్వామి ఆలయం మరియు జైన సాంప్రదాయ దేవాలయాలు కూడా కలవు.

**35. హేమావతి :** మడకశిరకు 33 కి.మీ దూరంలో ఉన్న హేమావతిలో సిద్ధేశ్వరాలయం, దొడ్డేశ్వరాలయం, విరూపాక్షేశ్వరాలయం, మల్లేశ్వరాలయం ముఖ్యమైనవి. హేమవతిలోని జైన దేవాలయమునకు ప్రతి సం|| దేశం నలుమూలల నుండి జైన భక్తులు వస్తారు.





## 11. చిత్తూరు జిల్లా

**1. వైశాల్యం** : 15,152 చ.కి.మీ.
**2. జనాభా** : 35,00,000
**3. అక్షరాస్యత** : 30%
**4. మండలాలు** : 66 (1489 గ్రామాలు)
**5. నదులు** : స్వర్ణముఖి, బాహుదా, కల్యాణి, ఆరణి, కాండివ్య, పాపఘ్ని.
**6. అడవులు** : 30%
**7. పంటలు** : వేరుశనగ, చెఱకు, సామెలు, రాగులు, సజ్జలు, ఉలవలు, జొన్నలు, వరి, మామిడి.
**8. ఖనిజాలు** : బంగారం, స్టియటైట్, ఇనుము, క్వార్ట్జ్
**9. పరిశ్రమలు** : చాక్లెట్లు, లెదర్, సిరామిక్స్ పరిశ్రములు ఇవికాక చిన్నతరహా, కుటీర పరిశ్రమలు, డ్వాక్రాగ్రూపుల ద్వారా చేతి వృత్తులు.
**10. విజయనగరం నుండి ఈ జిల్లాలోని వివిధ ప్రాంతాలకు గల దూరం (సుమారుగా కి.మీ.లలో):**

| పట్టణం/నగరం | దూరం | పట్టణం/నగరం | దూరం |
|---|---|---|---|
| తిరుపతి | 70 | వెలేరు | 75 |
| వెంకటగిరి కోట | 95 | నగరి | 110 |
| శ్రీకాళహస్తి | 110 | మదనపల్లి | 100 |
| పుత్తూరు | 95 | పుంగనూరు | 70 |

**11. సరిహద్దులు** : తూర్పు - నెల్లూరు జిల్లా
పశ్చిమ - కర్నాటక రాష్ట్రం
ఉత్తరం - అనంతపురం జిల్లా
దక్షిణం - తమిళనాడు రాష్ట్రం
**12. ముఖ్యకేంద్రం** : చిత్తూరు
**13. రైల్వేస్టేషన్** : చిత్తూరు, పుణ్యక్షేత్రం తిరుపతి.

**14. ప్రధాన పట్టణాలు :** వేపంజేరి, చిత్తూరు, పలమనేరు, కుప్పం, పుంగనూరు, పీలేరు, చంద్రగిరి, తిరుపతి, సూళ్ళూరుపేట, వెంకటగిరి, శ్రీకాళహస్తి, సత్యవీడు, నగరి, పుత్తూరు.

**15. మండలాలు(66) :** 1. చిత్తూరు 2. గుడిపాల 3. యడమర్రి 4. గంగాధర నెల్లూరు 5. పూతలపట్టు 6. పెనుమూరు 7. బంగారుపాలెం 8. తవనంపల్లె 9. ఐరాల 10. శ్రీరంగరాజాపురం 11. పాచికాపలెం 12. కమ్మపల్లె 13. పడమాలపేట 14. పాలసముద్రం 15. పుత్తూరు 16. కర్వేటినగర్ 17. నారాయణవరం 18. నగరి 19. నింద్ర 20. విజయపురం 21. చంద్రగిరి 22. పాకాల 23. పులిచర్ల 24.

తిరుపతి రూరల్ 25. తిరుపతి అర్బన్ 26. రేణిగుంట 27. శ్రీకాళహస్తి 28. ఏర్పేడు 29. తొట్టంబేడు 30. బుచ్చినాయుడు 31. కోవనూరు 32. సత్యవేడు 33. వరదయ్యపాలెం 34. నాగులాపురం 35. పిచ్చాటూరు 36. మదనపల్లె 37. నిమ్మనపల్లె 38. కురబాలకోట 39. బి. కొత్తకోట 40. పెద్దమాండ్యం తంబళ్ళ పల్లె పెద్ద తిప్ప సముద్రం 41. కలికిరి 42. పీలేరు 43. ములకల 44. వాయల్‌పాడు 45. గుర్రంకొండ 46. కలకాడ 47. కలికిరి 48. పీలేరు 49. ఎర్రవారిపాలెం 50. చిన్నగొట్టగల్లు 51. రింపిచర్ల 52. కంబంవారి పల్లె 53. పుంగనూరు 54. చోడేపల్లి 55. రామసముద్రం 56. సోడం 57. సోమాల 58. పెద్దరంజని 59. పలమనేరు 60. గంగవరం 61. బైరెడ్డిపల్లె 62. వెంకటగిరికోట 63. రామకుప్పమ్ 64. గూడుపల్లె 65. శాంతిపురం 66. కుప్పం.

**16. జిల్లా చరిత్ర :** చారిత్రక ప్రసిద్ధి చెందిన చంద్రగిరి, తిరుపతి ప్రాంతాలున్న ఈ జిల్లాను పలువురు రాజులు పాలించారు. పల్లవులు, చోళులు, యాదవులు, విజయనగర రాజులే కాకుండా బ్రిటిష్ వారి పాలన సాగిన ఈ జిల్లా అటవీ ప్రాంతాలు, కొండలు, కోనలతో విస్తరించి ఉంది. జిల్లాలో ప్రధాన పుణ్యక్షేత్రము తిరుపతి.



## చిత్తూరు జిల్లాలోని దర్శనీయ స్థలాలు

**1. కాణిపాకం :** చిత్తూరుకు 12 కి.మీ. దూరములో శ్రీ వరసిద్ధి వినాయక దేవస్థానము ప్రతి ఒక్కరూ దర్శించవలసినదే. మరియు మణికంఠేశ్వర స్వామి ఆలయం దర్శించగలరు.

**2. చిత్తూరు :** చిత్తూరు పట్టణములో శ్రీ కోదండ రామస్వామి ఆలయం, శ్రీ రామచంద్రమూర్తి ఆలయం, సుబ్రహ్మణ్యస్వామి ఆలయం చూడవలసినవి.

**3. తిరుమల :** ప్రపంచములో అద్భుతమైన పుణ్యక్షేత్రం. ఏడు కొండలపైన వెలసిన శ్రీ వేంకటేశ్వరస్వామి కలియుగ దైవం. స్వామివారికి నిత్యకళ్యాణము జరుగును. ముందుగా వరాహస్వామి వారిని దర్శించిన తరువాత స్వామివారిని దర్శించాలి. తలనీలాల స్వామి, వడ్డీ కాసులస్వామి, ప్రపంచ ప్రసిద్ధి చెందిన వైష్ణవ దేవాలయము.

**4. తిరుపతి :** రైల్వేస్టేషనుకు దగ్గరలో వున్న గోవిందరాజస్వామి ఆలయం. కోదండరామాలయం చూడవలసినదే! తరువాత కపిల తీర్థం మరియు హరేకృష్ణ ఆలయం చూడదగినది. ఇంకా గంగమ్మ ఆలయం, కాళీ ఆలయం, అంకాలమ్మ ఆలయం, అన్నపూర్ణాదేవి దేవాలయం మొదలగునవి దర్శించగలరు.

**5. తిరుచానూరు :** తిరుపతికి 5 కి.మీ. దూరములో వున్న పద్మావతీ దేవిని ప్రతి ఒక్కరూ స్వామివారిని దర్శించిన తరువాత దర్శించవలెను. ఇచ్చట సూర్యనారయణస్వామి కూడా కలదు మరియు శ్రీకృష్ణదేవాలయం దర్శించగలరు.

**6. నారాయణవనం :** కళ్యాణ వేంకటేశ్వరస్వామి ఆలయంలో దర్శించదగిన స్వామివారు వున్నారు.అంతేగాక సొరకాయల స్వామివారి సమాధి మందిరము కూడ భక్తులు తప్పక దర్శించాలి. పరమేశ్వరాలయము కూడ కలదు.



**7. శ్రీనివాసమంగాపురం :** తిరుపతి దగ్గరలో శ్రీనివాస మంగాపురంలో వేంకటేశ్వర స్వామిని దర్శించి తీరవలసినదే. తిరుపతికి 12కి.మీ. దూరములో వున్నది.

**8. మదనపల్లి :** చిత్తూరుకు 98 కి.మీ. మదనపల్లి మంచి విహారయాత్ర కేంద్రం 710 కి.మీ. సముద్రమట్టానికి ఎత్తుగా వున్నది ప్రదేశం. ఏనుగు ఆకారములో పర్వతాలు వున్నాయి. ఆంధ్ర ఊటీ అని పిలుస్తారు.

**9. హార్సిలీహిల్స్ :** మనదపల్లికి 20 కి.మీ. దూరంలో అనంతపురం రోడ్డుపై ఉన్న కొండలు సముద్ర మట్టానికి 4,326 అడుగుల ఎత్తులో ఉన్నాయి. ఒకనాటి ఏనుగుమల్లమ్మ కొండనే నేటి హార్సిలీహిల్స్‌గా పిలుస్తున్నారు. ఇచ్చట ఏనుగుమల్లమ్మ దేవాలయం కూడా ఉన్నది.

**10. పాపవినాశనం :** తిరుమల ఆలయానికి 4 కి.మీ. దూరములో పాపవినాశనం తీర్థం వున్నది.

**11. నెరబైలు :** తిరుపతికి 56 కి.మీ. దూరంలో ఈ ప్రాంతములో తలకొన జలపాతం వున్నది. ఇచ్చట సిద్ధేశ్వరస్వామి ఆలయం దర్శించ గలరు.

**12. చంద్రగిరికోట :** తిరుపతికి 11 కి.మీ. దూరములో చంద్రగిరికోట చూడదగినది. శ్రీ కృష్ణదేవరాయలు విశ్రమించిన కోట యిదే! తిరుపతి నుండి బస్సు సౌకర్యం వున్నది. మహామంత్రి తిమ్మరుసు జన్మస్థలం యిదే.

**13. నాగులాపురం :** నాగులాపురంలో వేదనారాయణ స్వామివారి మందిరము చాలా విశేషమైనది.

**14. అరగొండ :** చిత్తూరుకు దగ్గర అరగొండ ఆంజనేయస్వామివారు ఎంతో మహిమగల స్వామి. ఇచ్చట స్వామివారి పుష్కరిణిలో స్నానంచేసి తీరవలసినదే.

**15. అప్పలాయగుంట :** తిరుపతి దగ్గరలో ప్రసన్న వేంకటేశ్వరస్వామివారు వున్నారు.

**16. ఆకాశ గంగ :** ఆకాశం నుండి పడే నీటిధారగా వుండుట వలన ఆకాశ గంగ అని అంటారు. శ్రీవారి అభిషేకానికి ప్రతి రోజు ఇక్కడి నుండి రెండు బిందెలు నీటిని తీసుకొని వేస్తారు.

**17. తిరుమల :** తిరుమల కొండపైన ఆకాశ గంగ, పాపనాశనం, పాతళగంగ మరియు శిలాతోరణం, గీతోపదేశము మరియు మూడు నామాలు దర్శించండి. బేడీ ఆంజనేయస్వామిని చూడండి.

**18. శ్రీకాళహస్తి :** శ్రీకాళహస్తిలో శ్రీకాళహస్తేశ్వరుడు పాతాళ విఘ్నేశ్వరుడు, జ్ఞాన ప్రసూనాంబ అమ్మవారు దేవస్థానం అతి గొప్పది. ఇచ్చట రాహుకేతు సర్పదోష నివారణ పూజ జరుగును. శుకబ్రహ్మ ఆశ్రమము, భక్త కన్నప్ప దేవాలయము చూడండి. సువర్ణముఖి నదిలో స్నానం చేయండి.

**19. తొండమనాద్ :** ఇచ్చట గల ఆదిత్యేశ్వరస్వామి ఆలయం దర్శించగలరు.

**20. గుడిమల్లాం** : మహాదేవ పరశురామలింగం. ఈ లింగాకృతిని పోలిన మరో లింగం మరెక్కడా లేదు. (పరుశురామేశ్వరస్వామి) ఆలయం చూడగలరు. తిరుపతికి 20 కి.మీ దూరములో ఆగ్నేయదిశగా సువర్ణముఖి నదీ తీరాన వున్నది.

**21. గిరింపేట** : ఇచ్చట గల దుర్గాంబ అమ్మవారిని దర్శించగలరు.

**22. నగరి (బుగ్గ అగ్రహారం)** : అన్నపూర్ణ సమేత శ్రీకాశీవిశ్వేశ్వరస్వామి మరియు మహిషాసుర మర్ధని అమ్మవారు.

**23. కార్వేటినగరం** : ఇచ్చట గల వేణుగోపాలస్వామివారు దర్శించదగినది. పుత్తూరుకి 12 కి.మీ దూరములో వున్నది. స్కంధ పుష్కరిణిలో స్నానం చేయాలి.

**24. పోన్నాయ్** : తిరుత్తణి వెళ్లే మార్గములో పోన్నాయ్ గ్రామములో సతీసమేతముగా నవగ్రహ ఆలయం కలదు. ఇది నవీన ఆలయం. చూడదగినది.

**25. వైకుంఠ తీర్థం** : శ్రీవారి ఆలయానికి 3 కి.మీ. దూరములో వున్న 250 కోట్ల సంll క్రితం నాటి శిలాతోరణం తప్పక చూడవలసినదే!

**26. శ్రీ వేంకటేశ్వర అభయారణ్యం** : 500 చదరపు కిమీ. ఆటవీ ప్రాంతములో అరణ్యం, జాతీయపార్కు వున్నవి.

**27. శిలాతోరణం** : దీని వయస్సు 1500 మిలియన్ సంll అని భౌగోళిక వేత్తలుగా లెక్కగట్టారు. ఈ ఆర్చిపొడవు 25 అడుగులు.

**28. మొగిలి** : ఇచ్చట గల మొగలీశ్వర ఆలయము చాలా చిన్నది. చూడదగినది.

**29. తలకోన** : తిరుపతికి 56 కి.మీ దూరంలో నెరబైలులో తలకోన జలపాతము అద్భుతమైనది. ఇక్కడికి 11 కి.మీ. దూరాన కొండల మధ్య ఉన్న వేయిలింగాలకోనలో ఈ నదీజలాలు ప్రారంభమైనాయి. ఇక్కడ సిద్ధేశ్వర ఆలయంలో సిద్ధేశ్వరస్వామి, అమ్మవారు, విఘ్నేశ్వరుడు, సుబ్రహ్మణ్యస్వామి, నవగ్రహాలు గలవు. భాక్రాపేటకు అతి దగ్గరలో వున్నది.

**30. కైలాసనాథకోన** : తిరుపతి 45 కి.మీ. పుత్తురుకు 11 కి.మీ. దూరంలో ఉన్న ఈ కొండలలో 80 అడుగుల ఎత్తునుండి దూకే జలపాతమే కైలాసనాథకోన. పర్వాత భాగమున ఉండే ఈ కైలాసనాథకోనలో ఒక శివాలయము కలదు. ఈ జలపాత సమీపములో సహజసిద్ధంగా ఏర్పడిన కొండలనీడలో శివలింగం ప్రతిష్ఠితమై ఉన్నది. ఇచ్చట ఆది శంకరాచార్యుల విగ్రహము కలదు. నిరంతరం ప్రవహించే జలపాతం వున్నది.

**31. వాయల్పాడు** : వాయిల్పాడు గ్రామములో రామాలయము చూడదగినది. ఈ దేవాలయమునకు గాలిగోపురం ఆకర్షణీయంగా కనిపించును.

**32. ఏర్పేడు** : ఇచ్చట గల వ్యాసాశ్రమం చాలా ప్రసిద్ధి చెందినది. అనేక మంది మహానుభావులు దర్శనమిస్తారు. మహర్షి మళయాళస్వామి ఆశ్రమము చూడదగినది.



**33. చక్ర తీర్థం**: శ్రీవారి ఆలయానికి వాయువ్యముగా 3 కి.మీ. దూరములో ఆంజనేయ స్వామి ఆలయం తప్పక చూడవలసినదే.

**34. జాబాలి తీర్థం** : శ్రీవారి ఆలయానికి ఉత్తరముగా వున్న జాబాలి తీర్థములో ఆంజనేయస్వామి ఆలయం తప్పక చూడగలరు.

**35. భక్రాపేట** : ఇచ్చట గల సిద్ధేశ్వరస్వామి ఆలయం దర్శించగలరు.

**36. సూరతుపల్లి** : ఇచ్చట గల శయన పరమేశ్వరస్వామి ఆలయం దర్శించగలరు.

**37. యోగిమల్లవరం** : ఇచ్చట గల పరమేశ్వరస్వామి ఆలయం దర్శించగలరు.

**38. కుప్పం** : ఇచ్చట గల శివాలయం దర్శించగలరు మరియు కాళీ ఆలయం కూడా దర్శించగలరు.

**39. సోమపల్లి** : ఇచ్చటగల చెన్నకేశవస్వామి ఆలయం తప్పక దర్శించగలరు.

**40. సోదం** : ఇచ్చటగల చెన్నకేశవస్వామి ఆలయం తప్పక దర్శించగలరు.

**41. తెట్టు** : ఇచ్చటగల వేణుగోపాలస్వామి ఆలయం తప్పక దర్శించగలరు.

**42. రాజనాలబండ** : ఇచ్చటగల లక్ష్మీనరసింహస్వామి ఆలయం తప్పక దర్శించగలరు.

**43. చిప్పిలి** : మదనపల్లి మండలంలోని చిప్పిలి గ్రామములో యోగ భోగేశ్వరాలయం చాలా ప్రాచీనమైనది. అచ్చటనే తూర్పు దిశగా వేంకటేశ్వరాలయం గలదు.

**44. ఆరోగ్యవరం** : పాకాల, ధర్మవరం రైల్వేలైను మీదుగా ఉన్న మదనపల్లి రోడ్డు స్టేషన్ నుండి 13 కి.మీ దూరంలో ఉన్న ఈ ఊరు సముద్రమట్టానికి 710 మీll ఎత్తున గలదు. ఇచ్చట 16 కి.మీ దూరంలో "ఋషివ్యాలీ" స్కూలు చాలా ప్రసిద్ధమైనది.

**45. వరదయ్యపాలెం** : ఈ మండలంలోని గోవర్ధనపురంలోని శ్రీ కల్కి ఆధ్యాత్మిక కేంద్రం గలదు. ఇక్కడికి 12 కి.మీ దూరంలో 5వ జాతీయ రహదారి సమీపాన అటవీ ప్రాంతంలో సుమారు 32కోట్ల రూపాయల వ్యయంతో గోల్డెన్ సిటీ నిర్మాణం జరుగుతుంది. దీనిని తిలకించేందుకు ఇతర రాష్ట్రాలనుండి అనేక మంది తరలి వస్తున్నారు.

**46. ములకలచెరువు** : ఈ మండలంలో సోంపాల్యం అనే చిన్న గ్రామంలో చెన్నకేశవస్వామి ఆలయం దర్శించదగినది. ఇచ్చట గల ధ్వజస్తంభం 17 మీll ఎత్తున గలదు.

**47. సదాశివకోన** : పుత్తూరుకి 9 కి.మీ. దూరంలో ఉంది. ఇక్కడ గల శివపార్వతుల ఆలయం సందర్శకులకు ఆహ్లాదం కలిగిస్తుంది. ఈ కోనను చేరుకోవాలంటే 10 కి.మీ నడిచి 5 కి.మీ కొండ ఎక్కవలసి ఉంటుంది.

**48. సిద్ధులయ్యకోన :** శ్రీకాళహస్తి-సత్యవేడు రహదారిలో వరదయ్యపాలెం గ్రామం నుండి 12 కి.మీ దూరంలో కారంబాకం అడవిలో కొండల మధ్య ఉన్న ఈ సెలయేరు ఎంతో స్వచ్ఛమైనది.

**49. కళ్యాణి రేవులు-గంగమ్మశిరస్సు :** పలమనేరు మండలం దక్షిణప్రాంతం అడవిలో కళ్యాణిరేవులు, గంగమ్మ శిరస్సు జలపాతాలు కలవు. ఇవి 200 అడుగుల ఎత్తు నుండి ఉధృతముగా ప్రవహిస్తున్నది.

**50. దుముకురాళ్ళు :** పలమనేరు-కుప్పం రహదారిలో పైరెడ్డిపల్లికి 7 కి.మీ. దూరంలో దుముకురాళ్ళు జలపాతం ఉంది. ఇచ్చట ఉన్న రెండు శివలింగాలను అనేక మంది భక్తులు శివరాత్రి రోజున ప్రత్యేక పూజలు జరుపుతారు.

**51. బంగారు పాల్యం :** ఇచ్చట మొగలీశ్వరాలయం ఉన్నది. ఇచ్చట ఉన్న ఆలయం పుష్కరిణీపై భాగంలో ఉన్న నందీశ్వరుని నోటి నుండి త్రిశూల తీర్థం ధారా వాహికంలో వెలువడటం ఇచ్చటి విశేషం.



## 12. కడప జిల్లా

| | | |
|---|---|---|
| 1. **వైశాల్యం** | : | 15,379 చ.కి.మీ. |
| 2. **జనాభా** | : | 28,00,000 |
| 3. **అక్షరాస్యత** | : | 50% |
| 4. **మండలాలు** | : | 50 (ఇందులో 10 పట్టణాలు, 960 గ్రామాలు) |
| 5. **నదులు** | : | పెన్నేరు వంటి చిన్ననీటి వనరులు, పించ, మండలి, గుంజన, పుల్లంగి, బహుదా నదులు |
| 6. **అడవులు** | : | 30% |
| 7. **పంటలు** | : | వరి, జొన్న, కొర్రలు, వేరుశెనగ |
| 8. **ఖనిజాలు** | : | సీసం, సున్నపురాయి, బ్యారైట్, ముగ్గురాయి, సున్నపురాయి |
| 9. **పరిశ్రమలు** | : | 16 భారీపరిశ్రమలున్నాయి. చలువరాయి, జౌళి, సిమెంట్, ఎరువులు, బేరియం సల్ఫేట్ వంటిని ముఖ్యమైన పరిశ్రమలుగా చెప్పుకోవచ్చు! |

**10. కడప నుండి వివిధ ప్రాంతాలకు గలదూరం (కి.మీ.లలో)**

| పట్టణం/నగరం | దూరం | పట్టణం/నగరం | దూరం |
|---|---|---|---|
| రాయచోటి | 51 కి.మీ. | కోడూరు | 11 కి.మీ. |
| వేంపల్లె | 53 కి.మీ. | రాజంపేట | 75 కి.మీ. |
| బ్రహ్మంగారి మఠం | 50 కి.మీ. | ఎర్రగుంట్ల | 41 కి.మీ. |
| జమ్మలమడుగు | 75 కి.మీ. | పోరుమామిళ్ళ | 60 కి.మీ. |



**11. సరిహద్దులు** : తూర్పు - నెల్లూరు జిల్లా
పశ్చిమ - అనంతపురం జిల్లా
ఉత్తరం - కర్నూలు జిల్లా
దక్షిణం - చిత్తూరు జిల్లా

**12. ముఖ్యకేంద్రం:** కడప

**13. రైల్వేస్టేషన్** : రైల్వేస్టేషన్‌గా సిద్ధవటం

**14. ప్రధాన పట్టణాలు :** కడప, ప్రొద్దుటూరు, రాయచోటి, పులివెందుల, రాజంపేట, జమ్మలమడుగు

**15. మండలాలు(50) :** 1. కడప 2. చెన్నూరు 3. ఖాజీపేట 4. వల్లూరు 5. పెండ్లిమర్రి 6. చింతకొమ్మదిన్నె 7. రాయచోటి 8. చిన్నమండెం 9. సుండుపల్లి 10. సంబేపల్లి 11. వీరబల్లి 12. లక్కిరెడ్డిపల్లి 13. చెక్రాయపేట 14. గాలివీడు 15. రామాపురం 16. కమలాపురం 17.ఎర్రగుంట్ల 18. వీరపునాయనిపల్లె 19. రైల్వేకోడూరు 20. చిట్వేలు 21. ఓబులవారిపల్లె 22. పుల్లంపేట 23. రాజంపేట 24. నందలూరు 25. పెనగలూరు 26. సిద్ధవటం 27.ఒంటిమిట్ట 28. అట్లూరు 29. బద్వేలు 30. గోపవరం 31. పోరుమామిళ్ల 32. నరసాపురం 33. కోడూరు 34. ముద్దనూరు 35. బ్రహ్మంగారి మఠం 36. జమ్మలమడుగు 37. పెద్దముడియం 38. మైలవరం 39. బ్రహ్మంగారి మఠం 40. కొండాపురం 41. పులివెందుల 42. సింహాద్రిపురం 43. లింగాల 44. తొండూరు 45. వేంపల్లి 46. వేముల 47. ప్రొద్దుటూరు 48. రాజుపాలెం 49. చాపాడు 50. మైదుకూరు 51. దువ్వూరు.

**16. జిల్లా చరిత్ర :** ఒకప్పుడు పవిత్ర స్థలంగా భావించే కడప జిల్లా రాయలసీమలో వెనుకబడిన ప్రాంతం. ప్రకృతి వైపరీత్యాలు వర్షపాతం కరువవడానికి తోడు పాలకుల నిర్లక్ష్యం వల్ల ఈ ప్రాంతం అంతగా అభివృద్ధికి నోచుకోలేదు. ఎర్రచందనం, బైరైటీస్, గ్రానైట్ పరిశ్రమల కారణంగా పెద్ద మొత్తంలో విదేశీమారక ద్రవ్యం లభిస్తుంది.

## కడప జిల్లాలోని దర్శనీయ స్థలాలు

**1. కందిమల్లయ్య పల్లి :** శ్రీ పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వామివారి మందిరము ప్రతి మానవుడు చూడదగినది. మైదుకూరు నుండి 24 కి.మీ. దూరములో వున్నది. సిద్దయ్య గారి మఠం, పోలేరమ్మ గుడి చూడదగినవి.

2. **కడప పట్టణం :** దేవుని గడపలోని శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయం మరియు సోమేశ్వరస్వామి ఆలయం కూడ కలదు.

**3. ప్రొద్దుటూరు :** ప్రొద్దుటూరులోని అగస్త్యేశ్వరస్వామి ఆలయం చాలా ప్రసిద్ధి చెందినది.మరియు రామాలయం, కన్యకాపరమేశ్వరీ దేవాలయం చూడదగినది.

**4. ఒంటిమిట్ట :** ఇచ్చటగల సీతాసమేత రామలక్ష్మణ ఆలయం ప్రతిరామ భక్తుడు దర్శించ గలిగినది. శ్రీరామ నవమినాడు ఇచ్చట అత్యంత వైభవంగా ఉత్సవములు చేస్తారు. కడపకు 27 కి.మీ దూరములో ఉన్నది.

**5. గండికోట :** ఇచ్చట గల ఆంజనేయస్వామి ఆలయం చాలా ప్రసిద్ధి చెందినది. రాయచోటి – పులివెందుల తాలికాల మధ్య ఉత్తరవాహిని అయిన పాపాఘ్ని నదీ తీరాన ఈ క్షేత్రం వున్నది. ఇక్కడ భూమాంద ఆశ్రమం కూడా ఉన్నది. హనుమంతుడు శ్రీరాముని ఆహ్వానించిన క్షేత్రం. మరియు రంగనాధ, మాధవస్వామి ఆలయములు కలవు. కడపకు 25 కి.మీ దూరములో వున్నది.

**6. పుష్పగిరి :** శ్రీ చెన్నకేశవ స్వామి ఆలయం పినాకిని నదీతీరములో కలదు. మరియు వైద్యనాధేశ్వరస్వామి ఆలయము కలదు. పుష్పగిరి పీఠాధిపతుల ఆశ్రమము చూడండి. వైద్యనాధేవ్వరస్వామి ధన్వంతరీ ప్రతిష్ఠ. అమ్మవారు రాజరాజేశ్వరీ దేవి.

**7. జ్యోతి :** ఇచ్చట జ్యోతినాథ ఆలయము పెన్నానది ఎడమవైవున కలదు.

**8. ముక్తిరామేశ్వరం :** ప్రొద్దుటూరుకు 6 కి.మీ. దూరంలో నున్న ముక్తిరామేశ్వరంలో స్వామిలింగరూపంలో ఉంటాడు.

**9. అల్లాడబల్లి :** ఇచ్చట గల వీరభద్ర స్వామి ఆలయం చాలా ప్రఖ్యాతి చెందినది.

**10. హత్యారాల :** ఇచ్చట త్రేతశ్వర ఆలయం చాలా ప్రసిద్ధి చెందినది, చూడదగినది.

**11. అనిమెల :** కమలాపురం దగ్గరలోని అనిమెలలోని సంగమేశ్వర ఆలయంలోని స్వామి పేరు సంగమేశ్వరుడు దర్శించదగినది.

**12. వీరబల్లి :** ఇచ్చటగల శ్రీపతి హిమాచల ఆలయం చాలా ప్రసిద్ధి చెందినది.

**13. తాళ్ళపాక :** రాజంపేట 3 కి.మీ. దూరంలో గల ఈ గ్రామము పదకవితా పితామహుడు తాళ్ళపాక అన్నమాచార్యుల జన్మస్థలం. చెన్నకేశవాలయం మరియు సిద్దేశ్వర స్వామి దేవాలయం చూడగలరు.

**14. నందలూరు :** కడప నుండి 45 కి.మీ. సౌమ్యనాధస్వామి దేవాలయం కలదు. బౌద్ధక్షేత్రం కూడ వుంది.

**15. రాయచోటి :** దక్షప్రజాపతి కాలానికి సంబంధించిన భద్రకాళీ సమేత వీరభద్రేశ్వర స్వామి ఆలయము దర్శించదగినది. ఈ ఆలయ ఆవరణలోనే కాలభైరవ దేవాలయము కూడ కలదు. చాలా ఎత్తుగల ధ్వజ స్థంభమును చూసినవారు ఆశ్చర్యపోవలసినదే.

**16. చిన్మయారణ్యాశ్రయం :** కడప జిల్లా రాజంపేట, కోడూరు మార్గంలో తూర్పు దిశయందున్న ఎల్లాయ పల్లె గ్రామ పర్వత పాద భాగమున కలదు.

**17. జమ్మలమడుగు :** జమ్మల మడుగు నారపుర అగ్రహారంలో శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయం చూడదగినది.



**18. తలిగొండ :** తలిగొండ గ్రామములో సాలగ్రామ నరసింహస్వామి దేవాలయమును దర్శించగలరు.

**19. పెద్దముడియం :** పెద్దముడియం గ్రామములో నరసింహస్వామి దేవాలయమును దర్శించగలరు.

**20. చదిపి రాల :** ఇచ్చట గల అగస్త్యేశ్వరస్వామి ఆలయం దర్శించగలరు.

**21. సోమశిల :** ఇచ్చట గల సోమేశ్వరస్వామి ఆలయం దర్శించగలరు.

**22. సిద్ధవటం :** ఇచ్చట గల సిద్ధవటేశ్వస్వామి ఆలయం దర్శించగలరు.

**23. పెద్దనపాడు :** ఇచ్చట గల విశ్వేశ్వరస్వామి ఆలయం దర్శించగలరు.

## 13. కర్నూలు జిల్లా

1. **వైశాల్యం** : 17,658 చ.కి.మీ.
2. **జనాభా** : 33,60,000
3. **అక్షరాస్యత** : 45%
4. **మండలాలు** : 45 (945 గ్రామాలు)
5. **నదులు** : తుంగభద్ర, హింద్రీ, కృష్ణా వంటి నదులు; రాళ్లవాగు, పంగిడివాగు, గుండ్లేరు వంటి చిన్నవనరులు.
6. **అడవులు** : 20%
7. **పంటలు** : వరి, జొన్న, సజ్జలు, కొర్రలు, వేరుశెనగ వంటి వ్యాపార పంటలు
8. **ఖనిజాలు** : ప్లాస్టర్ ఆఫ్ పారిస్ (తెల్ల బంకమన్ను) హెమటైటు, సున్నపురాయి,
9. **పరిశ్రమలు** : సిమెంటు, పేపరు, రసాయనాలు, వంటనూనెలు, వంటి భారీ
10. **కర్నూలు నుండి వివిధ ప్రాంతాలకు గలదూరం (కి.మీ.లలో)**

| పట్టణం/నగరం | దూరం | పట్టణం/నగరం | దూరం |
|---|---|---|---|
| ఆళ్లగడ్డ | 130 కి.మీ. | ఎమ్మిగనూరు | 70 కి.మీ. |
| ఆత్మకూరు | 70 కి.మీ. | ఆదోని | 100 కి.మీ. |
| మహానంది | 94 కి.మీ. | నంద్యాల | 80 కి.మీ. |

11. **సరిహద్దులు** : తూర్పు – ప్రకాశం జిల్లా
    పశ్చిమ – కర్ణాటక రాష్ట్రం
    ఉత్తరం – మహబూబ్‌నగర్ జిల్లా
    దక్షిణం – అనంతపురం జిల్లా
12. **ముఖ్యకేంద్రం**: కర్నూలు
13. **రైల్వేస్టేషన్** : నంద్యాల

**14. ప్రధాన పట్టణాలు :** కర్నూలు, ఆదోని, నంద్యాల, ఎమ్మిగనూరు, ఆత్మకూరు, శ్రీశైలం.

**15. మండలాలు(54) :** 1. నంద్యాల 2. మహానంది (తిమ్మాపురం) 3. బండి ఆత్మకూరు 4. పాణ్యం 5. గడివేముల 6. ఆళ్ళగడ్డ 7. రుద్రవరం 8. సిరివెళ్ల 9. చాగలమర్రి 10. గోస్పాడు 11. కోవెలకుంట్ల 12. దొర్నిపాడు 13. ఉయ్యాలవాడ 14. సంజామల 15. కొలిమిగుండ్ల 16. బనగాపల్లి 17. ఔక్ 18. ఆత్మకూరు 19. వెల్గోడు 20. పాములపాడు 21. కొత్తపల్లి 22. శ్రీశైలం 23. నందికొట్కూరు 24. మిదుతూరు 25. పగిడియాల 26. జూపాడు బంగ్లా 27. గూడూరు 28. కోడుమూరు 29. సి. బెళగాల్ 30. డోన్ 31. బేతంచెర్ల 32. వెల్దుర్తి 33. కృష్ణగిరి 34. ప్యాపిలి 35. కర్నూలు 36. కల్లూరు 37. ఓర్వకాల్ 38. ఆదోని 39. కౌసిగి 40. కౌతాలమ్ 41. పెద్దకడుబూరు 42. ఎమ్మిగనూరు 43. నందవరం 44. మంత్రాలయం 45. ఆలూరు 46. చిప్పగిరి 47. అస్పారి 48. హోలగుంద 49. హాలహర్వి 50. పత్తికొండ 51. దేవరకొండ 52. తుగ్గలి 53. మద్దికెర 54. గోనెగొండ్ల.

**16. జిల్లా చరిత్ర :** ఆంధ్ర రాష్ట్రానికి రాజధానిగా ఉన్న కర్నూలు రాయలసీమలో ఒక ప్రధాన జిల్లా. ఒకప్పుడు 'కందెనవోలు'గా ప్రశస్తమైన ఈ ప్రాంతం నల్లమల, ఎర్రమల కనుమలు, తూర్పు కనుమల మధ్య ఉంది. బీజాపూర్ సుల్తానుల పాలనలో కొంతకాలం ఉన్న ఈ ప్రాంతం నేడు పరిశ్రమల కేంద్రంగా ఉంది. శ్రీశైలం ప్రాజెక్టు, విద్యుత్ ఉత్పత్తి కేంద్రం కారణంగా ఈ ప్రాంతం పారిశ్రామికంగా అభివృద్ధి చెందింది.

## కర్నూలు జిల్లాలోని దర్శనీయ స్థలాలు

**1. మంత్రాలయం:** ఆదోనికి 57 కి.మీ. దూరములో వున్న మంత్రాలయములో శ్రీరాఘవేంద్ర స్వామి బృందావనము కలదు ప్రతి ఒక్కరూ దర్శించదగినవి. మరియు పంచముఖ ఆంజనేయస్వామి ఆలయం చూడగలరు.

**2. మహానంది :** నంద్యాలకు 16 కి.మీ దూరములో మహానందీశ్వరాలయం ప్రసిద్ధి చెందినది. మహానంది దగ్గరలో 9 నందులు. వీటిని నవ నందులు అంటారు. నీరు ఎక్కడ నుండి వచ్చేది తెలియును

**3. శ్రీశైలం :** ద్వాదశ జ్యోతిర్లింగాలలో ఒకటియైన శ్రీశైలం కర్నూలుకు 70 కి.మీ. దూరములో వున్నది. అమ్మవారు మల్లికార్జున సమేత భ్రమరాంబ దేవి శైవక్షేత్రాలలో అతి ముఖ్యమైనది. భారతదేశము మొత్తములోని ద్వాదశజ్యోతిర్లింగములలోని ఒక లింగముతోబాటుగా అష్టాదశ పీఠములలో ఒక పీఠము కలిగిన ఏకైక క్షేత్రము.

**4. అహోబిలం :** నంద్యాలకు 68 కి.మీ. దూరములో వున్న అహోబిలం నవనారసింహులు వున్నారు. కొండ క్రింద లక్ష్మీ నరసింహ స్వామి దేవాలయం



వున్నది. ఆళ్ళగడ్డ నుండి 24 కి.మీ. దూరములో వున్నది. దీనినే పంచ కాశీ క్షేత్రమని పిలుస్తారు. ఇక్కడ పాపనాశని నది ఉన్నది. శ్రీ ఆదిశంకరాచార్యుల వారు శ్రీ చక్రము ప్రతిష్ఠించినారు. కాశిరెడ్డి నాయన ఆశ్రమం చూడండి. ఆలయం చుట్టుప్రక్కల 9 నరసింహస్వామి విగ్రహాలు ఉన్నాయి. ఈ క్షేత్రం 32 నరసింహక్షేత్రాలలో ప్రధానమైనది.

**5. సంగమేశ్వరం :**కర్నూలుకు 56 కి.మీ. దూరములో సంగమేశ్వర స్వామి లింగరూపములో వుంటాడు. ఇచ్చట తుంగభద్ర, వేణి, భీమరాలు, మూలసహరిణి అనే నదులు కృష్ణానదిలో కలుస్తాయి.

**6. నంద్యాల :** నంద్యాలలో ప్రథమ నంది, బ్రహ్మ నంది, నాగనంది, కలవు. మొత్తము నవ నందులు ప్రతి ఒక్కరు దర్శించవలసినదే. నరసింహస్వామి దేవాలయము దర్శించగలరు. శ్యామచరణ్ బాబా గారిని దర్శించండి.

**7. యాగంటి :** ఉమామహేశ్వర స్వామి దేవాలయం, అగస్త్యేశ్వర స్వామి దేవాలయము. బసవయ్య గురించి శ్రీ వీరబ్రహ్మంగారు ప్రస్తావించినారు. బసవయ్య పెరుగుతున్నాడు. బనగానపల్లె అతి సమీపములో ఎర్రకనుమలలో ఈ క్షేత్రం ఉన్నది.

**8. పంచలింగాలు :** ఎక్కడ లేని పంచలింగేశ్వరస్వామి దేవాలయం దర్శించగలరు.

**9. సత్యవోలు :** ఇచ్చట గల రామలింగేశ్వరస్వామి దేవాలయం చూడగలరు.

**10. కర్నూలు :** నక్షత్రాకారములో వున్న శ్రీసాయిబాబా దేవాలయం, మరియు శ్రీరామచంద్రుని దేవాలయం, అయ్యప్ప దేవాలయం, బిర్లా మందిరము, శ్రీ నిమిషాంబా అమ్మవారిని దర్శించండి. శ్రీ బాలసాయిబాబా ఆశ్రమము కలదు. కొండారెడ్డి బురుజు ఎక్కి ఆనందించండి. తుంగభద్రానదీ తీరాన బాలసాయిబాబా ఆశ్రమము దర్శించదగినది. మరియు షిర్డి సాయిబాబా ఆలయమును కూడా దర్శించగలరు.

**11. కాల్వబుగ్గ :** ఇచ్చట గల బుగ్గ రామేశ్వరస్వామి దేవాలయం దర్శించదగినది.

**12. పాణ్యం :** కర్నూలు జిల్లాలోని పాణ్యంలో సుబ్రహ్మణేశ్వరస్వామి ఆలయం చూడగలరు.

**13. ఓర్వకల్లు :** కర్నూలు జిల్లాలోని ఓర్వకల్లులోని నాగేశ్వరస్వామి ఆలయం దర్శించగలరు. మరియు ఆంజనేయస్వామి ఆలయము చూడగలరు.

**14. నందికొట్కూరు :** కర్నూలు జిల్లాలోని నంది కొట్కూరు నాగేశ్వరస్వామి ఆలయం దర్శించదగినది.

**15. ఆత్మకూరు :** కర్నూలు జిల్లాలోని ఆత్మకూరులో తాండవ మల్లేశ్వరస్వామి ఆలయం దర్శించగలరు.

**16. బెలూమ్ గుహలు :** క్రొత్తగా విశేషత సంతరించుకొన్న గుహలు చూడదగినవి. కొలిమి గుండ్ల మండలములో తాడిపత్రి నుండి 30 కి.మీ. దూరములో వున్నాయి. పెద్దలకు 20/- పిల్లలకు 15/- టిక్కెట్లు నంద్యాల నుండి 60 కి.మీ. దూరము.

**17. గణదాల :** మంత్రాలయము దగ్గర తుంగభద్రానది కవతల తీరాన గల గణదాల గ్రామములో పంచముఖ ఆంజనేయాలయము దర్శించదగినది.

**18. ఎస్.కొత్తూరు :** పాణ్యం దగ్గరలో నున్న ఎస్. కొత్తూరు సుబ్రహ్మణ్యస్వామి ఆలయం చూడగలరు.

**19. మద్దులేరు :** మద్దులేరు గ్రామములో మద్దులేటి నరసింహస్వామి దేవాలయము తప్పక దర్శించగలరు. చాలా ప్రాముఖ్యత కల క్షేత్రము.

**20. బేతంచర్ల :** బేతంచర్ల గ్రామములో గట్ల నరసింహస్వామి దేవాలయమును తప్పక దర్శించగలరు. మరియు ఆంజనేయస్వామి ఆలయం దర్శించగలరు.

**21. బ్రహ్మగుండం :** బ్రహ్మగుండం గ్రామములో వెల్దుర్తి దగ్గరలో నున్న బ్రహేశ్వరస్వామి దేవాలయమును దర్శించగలరు.

**22. ఉరవకుండ :** ఆదోనికి దగ్గరలో నున్న ఉరవకుండ గ్రామములో నరసింహస్వామి దేవాలయమును చూడగలరు.

**23. ఆదోని :** ఆదోనిలో రణమండల ఆంజనేయస్వామి దేవాలయము దర్శించగలరు.

**24. మూలసాగరం :** మూలసాగరం (నంద్యాల)లో ఆంజనేయస్వామి దేవాలయము దర్శించగలరు.

**25. మామిడాలపాడు :** మామిడాలపాడులో ఆంజనేయస్వామి ఆలయం దర్శింగలరు.

**26. కుదారాది :** ఇచ్చట గల త్రిపురాంతకేశ్వరస్వామి ఆలయం దర్శించగలరు.

**27. ఓంకారేశ్వరము :** ఇచ్చటగల ఓంకారేశ్వరస్వామి ఆలయం దర్శించగలరు.

**28. పామిడి :** ఇచ్చట గల భోగేశ్వర స్వామి ఆలయం దర్శించగలరు.

**29. కొత్తపల్లె :** ఇచ్చట గల తాండవ మల్లేశ్వరస్వామి ఆలయం దర్శించగలరు

**30. బనగానపల్లె :** బ్రహ్మంగారు నివసించిన గరిమిరెడ్డి అచ్చమ్మ గారి యిల్లు. స్వామి వారు కాలజ్ఞానం రాసిన రవ్వలకొండ చూడండి. స్వామి వారు నిర్మించిన లోమఠం దర్శించండి.

**31. నొస్సం :** నయనాలప్పస్వామి కొండ దర్శించండి. ఆశ్రమము చూడండి.

**32. పెన్న అహోబిలం :** ఇచ్చట గల లక్ష్మీదేవిని దర్శించగలరు.

**33. నందవరం :** ఇచ్చటగల త్రిపురసుందరీదేవీ అమ్మవారిని దర్శించగలరు.

**34. మాధవరం :** కర్నూలుకు 32 కి.మీ దూరములో ఈ గ్రామంలో కళాతోరణం చారిత్రకమైనది. యిది బొంబాయి గేట్‌వే ఆఫ్ ఇండియా లా ఉంటుంది.





## 14. రంగారెడ్డి జిల్లా

| | | |
|---|---|---|
| **1. వైశాల్యం** | : | 7,493 చ.కి.మీ. |
| **2. జనాభా** | : | 25,00,000 |
| **3. అక్షరాస్యత** | : | 49% |
| **4. మండలాలు** | : | 37 |
| **5. నదులు** | : | మూసీ, ఈసీ నదులు |
| **6. అడవులు** | : | 4% |
| **7. పంటలు** | : | వరి, జొన్న, మొక్కజొన్న, వేరుశెనగ |
| **8. ఖనిజాలు** | : | క్వార్ట్జ్, సున్నపురాయి, ఫెల్‌స్పార్, గ్రానైట్ |
| **9. పరిశ్రమలు** | : | సిమెంట్, టైర్లు, తోళ్ళు, జనపనార |
| **10. రెవిన్యూ ఒవిజన్ల్** | : | 1. హైదరాబాద్ (తూర్పు)<br>2. వేచళ్ళ<br>3. వికారాబాద్ |
| **11. సరిహద్దులు** | : | తూర్పు - నల్గొండ<br>పశ్చిమ - కర్నాటక<br>ఉత్తరం - మెదక్<br>దక్షిణం - మహబూబ్‌నగర్ |
| **12. ముఖ్యకేంద్రం** | : | వికారాబాద్ |
| **13. రైల్వేస్టేషన్** | : | వికారాబాద్ |

**14. ప్రధాన పట్టణాలు :** హైదరాబాద్ (తూర్పు), వేచళ్ళ, వికారాబాద్.

**15. మండలాలు(37) :** 1. ఇబ్రహీంపట్నం 2. నాచారం 3. మంచల్ 4. మహేశ్వరం 5. కందుకూరు 6. హయత్‌నగర్ 7. ఉప్పల్ 8. సరూర్‌నగర్ 9. ఘటకేసర్ 10. మేడ్చల్ 11. షామీర్‌పేట 12. కుతుబుల్లాపూర్ 13. కీసర 14. మల్కాజిగిరి 15. బాలానగర్ 16. సెరిలింగంపల్లి 17. రాజేంద్రనగర్ 18. శంషాబాద్ 19. శంకర్‌పల్లి 20. చేవెళ్ళ 21. మెయినాబాద్ 22. షాబాద్ 23. గండేడి 24. కుల్కచెర్ల 25. దోమ 26. వర్గి 27. పూడూర్ 28. ధారూర్ 29. నవాబ్‌పేట్ 30. వికారాబాద్ 31. మోమిన్‌పేట్ 32. మార్పల్లి 33. పెద్దేమల్ 34. బంట్వారం 35. బషీరాబాద్ 36. యాలాల్ 37. తాండూరు.

**16. జిల్లా చరిత్ర :** 1978లో ఏర్పడిన ఈ జిల్లాలో హైదరాబాద్ శివారు ప్రాంతాలు, తొమ్మిది మున్సిపాలిటీలు గ్రామ పంచాయితీలు ఉన్నాయి. హైదరాబాద్ చరిత్రే జిల్లా చరిత్రగా చెప్పవచ్చు. చేవెళ్ళ, వికారాబాద్, రాజేంద్రనగర్, తాండూరు, హయత్‌నగర్, ఇబ్రహీం పట్నం, మేడ్చల్ ప్రాంతాలు జిల్లాలో ముఖ్యమైనవి.

## రంగారెడ్డి జిల్లాలోని దర్శనీయ స్థలాలు

**1. బిక్కనూరు :** ఇచ్చుట గల శ్రీ రాజరాజేశ్వరి దేవాలయం చాలాప్రసిద్ధిమైనది చూడగలరు.

**2. సిద్ధిపేట :** ఇచ్చుట గల శ్రీ కోటిలింగేశ్వరస్వామి ఆలయం దర్శించగలరు.

**3. పాతలింగంపల్లి :** ఇచ్చుట గల నేరిలింగపల్లి మండలం శ్రీ వీరహనుమాన్ దేవాలయం మంగళవారం దర్శించగలరు.

**4. కీశరగుట్ట :** హైదరాబాద్ నగరమునకు 30 కి.మీ దూరములో తూర్పున ఉన్న కేశరగుట్ట పై శ్రీరామచంద్రుల వారిచే ప్రతిష్ఠి చేయబడిన రామలింగేశ్వర ఆలయమును దర్శించగలరు.

**5. కొసగండ్ల :** కొసగండ్ల గ్రామములో నరసింహస్వామి ఆలయమును దర్శించగలరు.

**6 వికారాబాద్ :** ఇచ్చుటగల అనంతపద్మనాభస్వామి దేవాలయము దర్శించగలరు.

**7. జంటుమిల్లి :** ఇచ్చట శ్రీరామ దేవాలయములో శ్రీరామునికి ఆదిశేషుడు పడగపట్టటం ఇతర ఏ రామాలయాలలోనూ కనపడదు. ఈ విగ్రహం నుండి నిరంతరం నీరు ఉబికి వస్తుంది. గుడికి దగ్గరలోనే గాడిదోనలు ఉన్నాయి. ఇందులో నీరు ఎండిపోదు.

**8. బొల్లారం :** ఇచ్చుటగల అయ్యప్ప దేవాలయం చాలా పెద్దది.

## 15. నల్గొండ జిల్లా

| | | |
|---|---|---|
| 1. | వైశాల్యం | : 14,240 చ.కి.మీ. |
| 2. | జనాభా | : 32,62,000 |
| 3. | అక్షరాస్యత | : 35% |
| 4. | మండలాలు | : 59 (1150 గ్రామాలు) |
| 5. | నదులు | : కృష్ణానది వంటి జీవనదితో పాటు, ఆలేరు, అహల్య, మూసీ వంటి ఉపనదులు |
| 6. | అడవులు | : 5% |
| 7. | పంటలు | : జొన్న, వేరుశనగ, వరి |
| 8. | ఖనిజాలు | : సున్నపురాయి, |
| 9. | పరిశ్రమలు | : కాగితం, కలప, సిమెంట్, పంచదార, ఔషధాలు వంటి చిన్నా పెద్దపరిశ్రమలు. |



**10. నల్గొండ నుండి వివిధ ప్రాంతాలకు గలదూరం (కి.మీ.లలో)**

| పట్టణం/నగరం | దూరం | పట్టణం/నగరం | దూరం |
|---|---|---|---|
| సూర్యాపేట | 50 | హుజూర్‌నగర్ | 88 |
| మిర్యాలగుడ | 48 | భువనగిరి | 74 |
| కోదాడ | 103 | నార్కట్‌పల్లి | 19 |
| యాదగిరిగుట్ట | 83 | దేవరకొండ | 64 |
| విప్పర్తి | 18 | | |

**11. సరిహద్దులు :** తూర్పు – ఖమ్మం, కృష్ణా జిల్లాలు
పశ్చిమ – మహబూబ్‌నగర్
ఉత్తరం – రంగారెడ్డి జిల్లా
దక్షిణం – మెదక్, వరంగల్ జిల్లా

**12. ముఖ్యకేంద్రం:** నల్గొండ

**13. రైల్వేస్టేషన్ :** నడికుడి – బీబీ నగర్ రైలు మార్గం

**14. ప్రధాన పట్టణాలు :** ఇబ్రహీంపట్నం, మలక్‌పేట, నల్లగొండ, ఆలేరు, భువనగిరి, మునుగోడు, దేవరకొండ.

**15. మండలాలు(59) :** 1. యాదగిరిగుట్ట 2. ఆలేరు 3. రాజంపేట 4. తుర్కపల్లి 5. భోన్‌గిరి 6. బొమ్మలరామారం 7. పోచంపల్లి 8. బీబీనగర్ 9. రామన్నపేట 10. వలిగొండ 11. చౌటుప్పల్ 12. మోత్కూర్ 13. ఆత్మకూరు 14. గుండాల 15. తుంగతుర్తి 16. తిరుమలగిరి 17. నూతనకల్లు 18. అర్వపల్లి (జాజిరెడ్డిగూడ) 19. సూర్యాపేట 20. పేన్‌పహాడ్ 21. ఆత్మకూర్ 22. మోతే 23. చేవేముల 24. నక్రేకల్ 25. కేతెపల్లి 26. షాలి గౌరారం 27. కట్టంగూరు 28. చెందూరు 29. మునుగోడు 30. నారాయణపూర్ 31. నల్గొండ 32. నార్కట్‌పల్లి 33. కాన్‌గల్ 34. తిప్పర్తి 35. చిట్యాల్ 36. నాంపల్లి 37. చింతపల్లి 38. గుర్రంపోడె 39. మర్రిగూడ 40. దేవరకొండ 41. పెద్ద అరిసేర్లపల్లి 42. చందంపేట 43. గుండ్లపల్లి 44. నిడమానూరు 45. పెద్దవూర 46. హలియ (అనుముల) 47. త్రిపురారం 48. మిర్యాలగూడ 49. రామర్లచెర్ల 50. వేములపల్లి 51. హుజూర్‌నగర్ 52. నేరడ్‌చర్ల 53. గర్డేపల్లి 54. మట్టంపల్లి 55. కొదాడ 56. మేళ్ళచెఱువు 57. చిలుకూరు 58. నడిగూడెం 59. మునగాల.

**16. జిల్లా చరిత్ర :** శాతవాహనుల కాలంలో నీలగిరి ప్రాంతంగా ప్రసిద్ధి చెందిన ఈ ప్రాంతమే కాలక్రమంలో నందికొండగా, నల్లగొండగా మారింది. శాతవాహనుల, కాదంబ రాజుల కాలంలో నీలగిరి పురోభివృద్ధి సాధించింది. చాళుక్య రాజు కీర్తివర్మ కాదంబుల నుంచి ఈ ప్రాంతాన్ని స్వాధీనం చేసుకొని కలుపుకొన్నాడు. కాకతీయుల పాలనలో 1687 వరకూ ఉన్న ఈ ప్రాంతాన్ని తరువాత ఔరంగజేబు వశపర్చుకొన్నాడు. స్వాతంత్ర్య సమరం, భూస్వాముల వ్యతిరేక పోరాటంలో విశేష

పాచుర్యాన్ని పొందిన నల్గొండ జిల్లా 1905 వరకూ వరంగల్‌లో ఒక భాగంగా ఉంది. 1905 విస్తారమైన వరంగల్లు నుండి నందికొండ ప్రాంతాన్ని విడదీసి గుర్తించారు. వర్షపాతం తక్కువే అయినప్పటికి కృష్ణానది, మూసీ, దండి, పెదవాగు కారణంగా మెట్టపంటలు పండుతున్నాయి. నాగార్జునసాగర్ డ్యాం ఉన్న ఈ జిల్లాలో సాగర్ - శ్రీశైలం వన్యప్రాణి కేంద్రం ప్రసిద్ధిమైంది.

## నల్గొండ జిల్లాలోని దర్శనీయ స్థలాలు

**1. యాదగిరి గుట్ట :** హైదరాబాద్‌కు 64 కి.మీ. దూరములో యాదగిరిగుట్టపై నున్న శ్రీ లక్ష్మీ నరసింహస్వామి ఆలయం చాలా ప్రఖ్యాతమైనది. క్షేత్రపాలకుడు ఆంజనేయ స్వామివారు.

**2. రాచకొండ :** నల్గొండకు 64 కి.మీ. దూరములో రాచకొండ దేవాలయములో దశావతర దృశ్యములు చూడదగినవి మరియు వీరభద్రస్వామి దేవాలయం చూడదగినది.

**3. నందికొండ :** నాగర్జునసాగర్‌కు 9 కి.మీ. దూరములో మ్యూజియంలో వస్తువులు చూడదగినవి.

**4. భువనగిరి :** హైదరాబాద్‌కు 51 కి.మీ. దూరములో కోట చారిత్రాత్మకమైనది. ఇచ్చట అగస్త్యేశ్వర స్వామి దేవాలయం కలదు. మరియు సీతారామ ఆంజనేయస్వామి దేవాలయము దర్శించగలరు.

**5. కాద్రనుపాక్ :** ఆలేరు రైల్వేస్టేషన్ నుండి 7 కి.మీ. దూరములో వున్న "సోమేశ్వరాలయం" భక్తులు దర్శించదగినవి.

**6. నాగర్జునసాగర్ :** నాగర్జునసాగర్ డ్యాం ప్రతి ఒక్కరూ చూడదగిన విహార కేంద్రము. సాగర్ నుండి శ్రీశైలం వరకు 110 కి.మీ. 4 గం॥ ప్రయాణం చేయవచ్చును.

**7. మేళ్ళచెరువు :** హుజూర్‌నగర్ నుండి 10కి.మీ. దూరములో వున్న స్వయంభూ శంభు లింగేశ్వరస్వామి ఆలయంనకు అనేక మంది భక్తులు దర్శించటానికి వస్తారు. కోదాడకు దగ్గరలో దక్షిణ దిశయందు ఈ గ్రామము కలదు.

**8. అనంతగిరి :** ఇచ్చట గల అనంతస్వామి దేవాలయం దర్శించగలరు.

**9. నార్కేట్‌పల్లి :** ఇచ్చట గల శ్రీరామలింగేశ్వరస్వామివారి గోపాలస్వామి వారి దేవాలయములు దర్శించగలరు.

**10. వీరిజాల :** ఇచ్చట గల వేణుగోపాలస్వామి దేవాలయం దర్శించగలరు.

**11. వాడపల్లి :** వాడపల్లిలోని అగస్త్యేశ్వరస్వామి మరియు శ్రీ లక్ష్మీనరసింహ స్వామి ఆలయములు చూడగలరు. నరసింహస్వామి తన తొడమీద లక్ష్మీదేవిని కూర్చుండబెట్టుకొని దర్శనమిచ్చుచుండును. కృష్ణా-మూసీ సంగమ స్థానములో ఈ క్షేత్రము గలదు.



**12. మట్టపల్లి :** కృష్ణానదీ తీరాన హుజూర్‌నగర్ సమీపాన ఈ గ్రామములో పర్వత గుహాయందు ప్రహ్లాద యోగానంద లక్ష్మీనరసింహస్వామి దేవాలయము కలదు. స్వామివారు స్వయంభువు. పంచనారసింహ క్షేత్రములలో యిది ఒకటి.

**13. పానగల్లు :** పచ్చలసోమేశ్వరస్వామి, ఛాయసోమేశ్వరస్వామి ఆలయములు కలవు. మరియు వెంకటేశ్వరస్వామి దేవాలయము దర్శించగలరు.

**14. పిల్లలమర్రి :** ఇచ్చట గల ప్రోలేశ్వరుడు, ఏకేశ్వరుడు, కామేశ్వరస్వామి దేవాలయములు దర్శించదగినవి.

**15. రామగిరి :** సూర్య పేటకు 30 కి.మీ. దూరములో రామచంద్రస్వామి ఆలయం ప్రసిద్ధి చెందినది.

**16. ఫణిగిరి :** శ్రీరామ క్షేత్రం, భౌద్ధక్షేత్రం చూడదగినవి దర్శించదగినవి.

**17. కొలనుపాక :** గొప్ప శైవ బౌద్ధ కేంద్రముగా పేరుగాంచినది. ఇది ప్రధాన జైన కేంద్రము. సోమేశ్వరాలయము కూడ కలదు. మరియు మహాలక్ష్మి సమేత వీరనారాయణ స్వామి దేవాలయము దర్శించగలరు.

**18. పులులు అభయారణ్యం :** దీని వైశాల్యం 3,500 కి.మీ. నల్గొండ, కర్నూలు మహబూబ్ నగర్, గుంటూరు ప్రకాశం జిల్లాలోని దట్టమైన అభయారణ్యం కలదు.

**19. అనుపు :** ఈ లోయలో కట్టడాలు మునిగిపోకుండా అవశేషాలను డ్యాంకు నాలుగు కి.మీ. దూరంలో అనుపు వద్దకు భౌద్ధ విశ్వవిద్యాలయమీద తరలించారు.

**20. నాగార్జునకొండ :** జలాశయం మధ్యలో ఈ కొండ దీవిలా ఉంటుంది. ఇక్కడి మ్యూజియంలో లోయ త్రవ్వకాలలో లభ్యమైన బౌద్ధ ధితువులు వున్నాయి.

**21. పెద్దిరెడ్డి గూడెం :** పెద్దిరెడ్డి గూడెంలో నరసింహస్వామి దేవాలయమును దర్శించగలరు.

**22. వెంకటాపురం :** వలిగొండ మండలములో వెంకటాపురం గ్రామములో మత్స్యగిరి లక్ష్మి నరసింహస్వామి దేవాలయమును దర్శించగలరు.

**23. అడుదేవుళ్ళపల్లి:** ఇచ్చటగల చెన్నకేశవస్వామి ఆలయం దర్శించగలరు.

## 16. మహబూబ్‌నగర్ జిల్లా

1. వైశాల్యం : 18,432 చ.కి.మీ.
2. జనాభా : 35,00,000
3. అక్షరాస్యత : 33%
4. మండలాలు : 64
5. నదులు : కృష్ణా, తుంగభద్ర
6. అడవులు : 3.03 లక్షల హెక్టార్లు
7. పంటలు : వరి, చెఱకు, జొన్న, సజ్జ
8. ఖనిజాలు : ఆస్‌బెస్టాస్, బంకదున్ను, ఫెల్స్‌పాల్
9. పరిశ్రమలు : తోళ్ళ పరిశ్రమలు, ఎరువులు, గాజు
10. రెవిన్యూ డివిజన్లు: 1. మహబూబ్‌నగర్ 2. కల్వకుర్తి 3. నాగర్ కర్నూలు 4. వనపర్తి
11. సరిహద్దులు : తూర్పు – నల్గొండ, పశ్చిమ – కర్నాటక రాష్ట్రం, ఉత్తరం – హైదరాబాద్, దక్షిణం – కృష్ణా
12. ముఖ్యకేంద్రం: మహబూబ్‌నగర్
13. రైల్వేస్టేషన్ : మహబూబ్‌నగర్

**14. ప్రధాన పట్టణాలు** : మహబూబ్‌నగర్, వనపర్తి, అల్లంపూర్, గద్వాల, అమరచీరార, ముక్తల్, కొడంగల్.

**15. మండలాలు(64)** : 1. కొడంగల్ 2. మద్దూరు 3. దౌలతాబాదు 4. బొమ్రాన్‌పేట 5. కోస్గి 6. రామరగిద్ద 7. మక్తల్ 8. ఉట్కూర్ 9. నారాయణపేట 10. ధన్‌వాడ్ 11. మంగ్నూర్ 12. కోయిల్‌కొండ 13. నవాబ్‌పేట (యస్మన్‌గండ్ల) 14. మహబూబ్‌నగర్ 15. హన్‌వాడ్ 16. జడ్చర్ల 17. బాలానగర్ 18. బూత్‌పూర్ 19. ఫరూక్‌నగర్ 20. కేశంపేట 21. కొందుర్గ్ 22. కొత్తూరు 23. అమంగల్ 24. కల్వకుర్తి 25. వెల్దండి 26. వంగూరు 27. మాడ్గుల్ 28. మిడ్జిల్ 29. తాలకొండపల్లి 30. నాగర్‌కర్నూల్ 31. తిమ్మాజీపేట 32. తెల్కపల్లి 33. బిజ్నపల్లి 34. గోపాల్‌పేట 35. తాండూర్ 36. కొత్తకోట 37. వనపర్తి 38. పెబ్బేర్ 39. ఘనాపూర్ 40. పెద్దమందాడి 41. ముసాపేట్ 42. ఆత్మకూరు 43. దేవరకద్ర 44. చిన్నచింతకుంట 45. నెర్వ 46. ఐజ 47. గద్వాల్ 48. ధారూర్ 49. మల్‌దకల్ 50. ఘట్ 51. అలంపూర్ 52. వడ్డెపల్లి 53. మాకోషాడ 54. ఇటిక్యయార్ 55. కొల్లాపూర్ 56. పెద్దకొత్తపల్లి 57. కోడేరు 58. ఫాన్‌గల్ 59. వీపంగండ్ల 60. అచ్చంపేట 61. అమరాబాద్ 62. లింగాల్ 63. బాలమూర్ 64. ఉప్పునూతుల.



**16. జిల్లా చరిత్ర :** కాకతీయుల పాలన కింద రెండు శతాబ్దాల పాటు ఉన్న ఈ ప్రాంతం పాలమూరుగా ప్రసిద్ధికెక్కింది. కరువు కాటకాలు, ఆహార కొరత ఏటా తప్పని రివాజు కావడంతో ఈ జిల్లాలో కేవలం సంచార జాతులు మాత్రమే నివసించేవారు. చోళుల, బహమనీ సుల్తానులు, నిజాముల పాలనలో ఉన్న ఈ ప్రాంతం పూర్తిగా వెనుకబడింది. కావడం వల్ల ఎటువంటి చారిత్రాత్మక విశేషాలు లేవు.

## మహబూబ్‌నగర్ జిల్లాలోని దర్శనీయ స్థలాలు

**1. అల్లంపురం :** నవబ్రహ్మదేవాలయం చాలా విశిష్టమైనది. సూర్యదేవాలయం, షోడశభుజ నరసింహదేవాలయం మరియు జోగులాంబ దేవాలయం కూడా కలదు. అష్టాదశ పీఠాలలో ఒక పీఠం.

**2. బిచ్‌పల్లి :** ఇచ్చట ఆంజనేయస్వామి ఆలయం దర్శించదగినది. చాలా ప్రాచీనాలయము.

**3. మన్యంకొండ :** ఇచ్చట గల వేంకటేశ్వరస్వామి ఆలయం చూడదగినది. మహబూబ్‌నగర్ నుండి 20 కి.మీ దూరములో రాయచూర్ పోవు మార్గములో కలదు.

**4. జౌత్తపోల్ :** ఇచ్చట గల మదనగోపాలస్వామి ఆలయం మరియు ఇతర ఆలయములు చూడదగినవి.

**5. జటప్రోలు :** జటప్రోలులోని అగస్త్యేశ్వరస్వామి ఆలయం చూడదగినది.

**6. శ్రీరంగపురం :** వనపర్తికి దగ్గరలో నున్న శ్రీరంగపురంలో శ్రీరంగనాథ స్వామి దేవాలయము దర్శించదగినది.

**7. వనపర్తి :** వనపర్తిలోని శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయము కూడా దర్శించదగినదే.

**8. సింగోట :** కొల్వాపురం మండలములో సింగోట గ్రామములో లింగాకారములో శ్రీ లక్ష్మి నరసింహస్వామి దేవాలయము చూడగలరు.

**9. మహబూబ్‌నగర్ :** మహబూబ్‌నగర్‌లో నరసింహస్వామి దేవాలయము దర్శించగలరు. ఇచ్చట ప్రతి శనివారం స్వామివారికి తైలాభిషేకం జరుగును.

**10. లక్ష్మీపురం కొండ :** అమరాబాద్ 14 కి.మీ. దూరములో లక్ష్మిపురం కొండపై నరనారసింహులు ఆలయములు విడి విడిగా వున్నవి దర్శించగలరు.

**11. గుప్త ఉమామహేశ్వరము :** ఇచ్చట గల ఉమామహేశ్వరస్వామి ఆలయం తప్పక దర్శించగలరు.

**12. చాగదొన :** ఇచ్చటగల రామలింగేశ్వరస్వామి ఆలయం తప్పక దర్శించగలరు.

**13. చిత్తటూరు** : ఇచ్చట గల శంభులింగేశ్వరస్వామి ఆలయం తప్పక దర్శించగలరు.

**14. ఏలేశ్వరం** : ఇచ్చట గల ఏలేశ్వరస్వామి ఆలయం తప్పక దర్శించగలరు.

**15. కుడలి** : ఇచ్చట గల సంగమేశ్వరస్వామి ఆలయం తప్పక దర్శించగలరు.

**16. గోపాలపురం** : ఇచ్చట గల మల్లీశ్వరస్వామి ఆలయం తప్పక దర్శించగలరు.

**17. చెక్కం** : ఇచ్చట గల చెక్కేశ్వరస్వామి ఆలయం తప్పక దర్శించగలరు.

**18. మీనంబరం** : ఇచ్చట గల పరశవేదీశ్వరస్వామి ఆలయం తప్పక దర్శించగలరు.

**19. కోడూరు:** ఇచ్చట గల రామలింగేశ్వరస్వామి ఆలయం తప్పక దర్శించగలరు.

**20. కలవ కొలను** : ఇచ్చటగల నంది కోటేశ్వరస్వామి ఆలయం తప్పక దర్శించగలరు.

**21. ముక్త్యాల** : ఇచ్చట గల రామలింగేశ్వరస్వామి ఆలయం తప్పక దర్శించగలరు.

**22. రంగాపూర్** : ఇచ్చట గల ఎల్లమ్మ ఆలయం తప్పక దర్శించగలరు.

**23. పత్తేపూర్** : ఇచ్చట గల మైసమ్మ ఆలయం తప్పక దర్శించగలరు.

**24. పొనగల్లు** : ఇచ్చట గల ఆదెమ్మ ఆలయం తప్పక దర్శించగలరు.

**25. బేకరపల్లి** : ఇచ్చట గల ఎల్లమ్మ ఆలయం తప్పక దర్శించగలరు.

**26. ముష్టిపల్లి** : ఇచ్చట గల ఆదెమ్మ ఆలయం తప్పక దర్శించగలరు.

**27. లింగాల** : ఇచ్చట గల కోదండరామాలయం తప్పక దర్శించగలరు.

**28. బందపల్లి** : ఇచ్చట గల రామాలయం తప్పక దర్శించగలరు.

**29. చిన్నరామేశ్వరం** : ఇచ్చట గలరామేశ్వరాలయం తప్పక దర్శించగలరు.

**30. గంగవరం** : ఇచ్చట గల శ్రీసీతారామాలయం తప్పక దర్శించగలరు.

**31. సిరుసనగండ్ల** : ఇచ్చట గల శ్రీ రామాలయం తప్పక దర్శించగలరు.

**32. మామిళ్లపల్లి** : ఇచ్చట గల నరసింహాలయం తప్పక దర్శించగలరు.

**33. వేలిజర్ల** : ఇచ్చట గల శ్రీనరసింహస్వామి ఆలయం తప్పక దర్శించగలరు.

**34. కొండదుర్గం** : ఇచ్చటగల శ్రీనరసింహస్వామిఆలయంతప్పక దర్శించగలరు

**35. వేలుంపల్లి** : ఇచ్చట గల శ్రీనరసింహస్వామి ఆలయం దర్శించగలరు.

**36. సింగపట్నం** : ఇచ్చట గల శ్రీనరసింహస్వామి ఆలయం దర్శించగలరు.

**37. నారాయణపేట** : ఇచ్చట గల లక్ష్మీనారాయణ ఆలయం దర్శించగలరు.

**38. బందేపల్లి** : ఇచ్చట గల రంగనాథస్వామి ఆలయం దర్శించగలరు.

**39. శ్రీపురం** : ఇచ్చట గల రంగనాయకస్వామి ఆలయం దర్శించగలరు.

**40. గట్లఖానాపురం** : ఇచ్చట గల రంగనాయకస్వామి ఆలయం దర్శించగలరు.

**41. మొగిలిగడ్డ** : ఇచ్చట గల రంగనాయకస్వామి ఆలయం దర్శించగలరు.



**42. శ్రీరంగపురం** : ఇచ్చట గల రంగనాయకస్వామి ఆలయం దర్శించగలరు.

**43. వీరయ్యపల్లె** : ఇచ్చట గల చెన్నకేశవస్వామి ఆలయం దర్శించగలరు.

**44. కేశంపేట** : ఇచ్చట గల వేణుగోపాలస్వామి ఆలయం దర్శించగలరు.

**45. బాలానగర్** : ఇచ్చట గల వేణుగోపాలస్వామి ఆలయం దర్శించగలరు.

**46. పిల్లలమర్రి** : మహబూబ్‌నగర్‌కు 8 కి.మీ దూరములో ఈ రావిచెట్టు. ఈ చెట్టు 3 ఎకరాలలో 1000 మందికి నీడ కల్పిస్తుంది. దూరం నుండి చూస్తే చిన్న కొండలా ఉంటుంది.

## 17. కరీంనగర్ జిల్లా

1. **వైశాల్యం** : 11,823 చ.కి.మీ.
2. **జనాభా** : 33,60000
3. **అక్షరాస్యత** : 39%
4. **మండలాలు** : 54 మండలాలు, 10 పట్టణాలు
5. **నదులు** : గోదావరి, మానేరు
6. **అడవులు** : 22%
7. **పంటలు** : వేరుశనగ, చెఱకు, పెసలు, మినుములు, జొన్న, మొక్కజొన్న, వరి, మిరప
8. **ఖనిజాలు** : బొగ్గు, సున్నపురాయి, మాగ్నటైట్, క్వార్ట్జ్
9. **పరిశ్రమలు** : పంచదార, సిమెంట్,
10. **కరీంనగర్ నుండి వివిధ ప్రాంతాలకు గలదూరం (కి.మీ.లలో)**

| పట్టణం/నగరం | దూరం | పట్టణం/నగరం | దూరం |
|---|---|---|---|
| కాళేశ్వరం | 68 కి.మీ. | రామగుండం | 129 కి.మీ. |
| జగిత్యాల | 50 కి.మీ. | మంథని | 68 కి.మీ. |
| హుజూర్ నగర్ | 43 కి.మీ. | పెద్దపల్లి | 34 కి.మీ. |
| సిరిసిల్ల | 60 కి.మీ. | | |

11. **సరిహద్దులు** : తూర్పు – మధ్యప్రదేశ్ రాష్ట్రం
    పశ్చిమ – నిజామాబాద్ జిల్లా
    ఉత్తరం – మెదక్ జిల్లా
    దక్షిణం – గోదావరి నది
12. **ముఖ్యకేంద్రం** : కరీంనగర్ పట్టణం
13. **రైల్వేస్టేషన్** : "రామగుండం"

**14. ప్రధాన పట్టణాలు :** కరీంనగర్, చొప్పదండి, జగిత్యాల, బుగ్గారం, మెట్‌పల్లి, సిరిసిల్ల, నేరేళ్ళ, పెద్దపల్లి, లక్కెట్టిపేట, చెన్నూరు, మంథని, పెద్దపల్లి, మేడారం, హుజారాబాద్, ఇందుర్తి.

**15. మండలాలు(34) :** 1. కరీంనగర్ 2. మానకొండూరు 3. తిమ్మాపూరు (ఎల్.ఎం.డి. కాలనీ) 4.బెజ్జంకి 5. గంగాధర 6. రాముడుగు, 7.చొప్పదండి 8. హుస్నాబాద్ 9. చిగురుమాడిడి 10. కొహెడ 11. హుజూరాబాద్ 12. జమ్మికుంట 13. వీణవంక 14. కమలాపూర్ 15. ఎల్కతుర్తి 16. కేశవపట్నం 17. సైదాపూర్ 18. భీమదేవరపల్లి 19. జగిత్యాల 20. రాయకల్ 21. ధర్మపురి 22. సారంగపురం 23. మల్యాల్ 24. కోడిమియాల 25. పెగడపల్లి 26. గొల్లపల్లి 27. మెట్‌పల్లి 28. కోరట్ల 29. మేడిపల్లి 30. ఇబ్రహీంపట్నం 31. మల్లాపూర్ 32. కత్లాపూర్ 33. సిర్‌సిల్లా 34. ఇల్లంతకుంట 35. గంభీరావుపేట 36. ముస్తాబాద్ 37. ఎల్లారెడ్డిపేట 38. వేములవాడ 39. బోయనపల్లి 40. కోనారావుపేట్ 41. చందుర్తి 42. పెద్దపల్లి 43. శ్రీరాంపూర్ 44. ఓడెల 45. రామగుండం 46. కమన్‌పూర్ 47. సుల్తానాబాద్ 48. వెల్లటూరు 49. ధర్మాపురం 50. కాటారం 51. మహాదేవపూర్ 52. జూలపల్లి 53. మంథని 54. తాడిచెర్ల 55. ముత్తారం (మహాదేవ్‌పూర్)

**16. జిల్లా చరిత్ర :** శతాబ్దాల పాటు ముస్లిం రాజుల పాలనలో ఉన్న కరీంనగర్ ప్రాంతాన్ని ఒకప్పుడు ఎలుగొందల అని పిలిచేవారు. రామగుండం పారిశ్రామికంగా అభివృద్ధి సాధించడంతో కరీంనగర్ ప్రాంతానికి వలసవచ్చే వారి సంఖ్యపెరిగింది.

## కరీంనగర్ జిల్లాలోని దర్శనీయ స్థలాలు

**1. వేములవాడ :** కరీంనగర్‌కు 36 కి.మీ. దూరంలో ఉన్న వేములవాడ శ్రీరాజరాజేశ్వరాలయము, భీమేశ్వరాలయము చాలాప్రసిద్ధిగాంచినవవి. రాష్ట్రంలోని తిరుమల తరువాత ఆదాయంలో 2వ స్థానంలో ఉంది.

**2. కాళేశ్వరం :** మంథనికి 32 కి.మీ. దూరంలో వున్న కాళేశ్వరాలయంలో ముక్తేశ్వరస్వామి కాళేశ్వరస్వామిని ఒకే పానమట్టంపై దర్శించవచ్చును. సరస్వతి, సూర్య, నరసింహస్వామి దేవాలయం దర్శించగలరు. ఇక్కడ బ్రహ్మదేవుని ఆలయం ఉన్నది. మహారాష్ట్రా, మధ్యప్రదేశ్, ఆంధ్రప్రదేశ్ కలిసే ప్రదేశం. త్రిలింగాలలో ఒకటి.

**3. మంథని:** దీని పూర్వనామం మంత్రపురిః. ఇది గొప్ప శైవక్షేత్రం. ఇచ్చట అనేక లింగస్వరూపంలో ఉన్న శివలింగములు కలవు. గౌతమేశ్వరాలయము కూడ కలదు. అక్కడ ఉన్న దత్తాత్రేయ దేవాలయమును దత్త జయంతి నాడు దర్శించి దత్త కృపకు పాత్రులు కాగలరు.

**4. బెజ్జంకి :** కరీంనగర్‌కు 46 కి.మీ. దూరంలో ఉన్న బెజ్జంకి గ్రామంలో శ్రీలక్ష్మీనరసింహస్వామి దేవాలయం గలదు.



**5. రాయగిరిదుర్గం :** కరీంనగర్‌కు 40 కి.మీ దూరంలో గల కమాన్‌పూర్ మండలంలో బేగంపేట గ్రామ శివారులో చూడచక్కని పర్వతమే రాయదుర్గం. దీని పేరే రత్నగర్భ. ఇచ్చట సీతారాములదేవాలయం, సీతారామ పాదాలు, శ్రీరామ ప్రతిష్ఠ శివలింగం, సీతాదేవీ పసుపు కుంకుమల భరిణె, గంగాగౌరి సవతుల బావులు, గౌరీబ్రహ్మ, మత్స్య గుండాలు మరియు మల్లివనం, బృందావనం ఉన్నాయి. రాయగిరి దుర్గమునకు నైరుతిగా పాండవలంక అనే పుణ్యస్థలంలో (తిరుమలలో పాపవినాశనంలాంటి) జలపాతం ఉంది. దీనికి రెండు మైళ్ళ రూరంలో బహుగుళ్ళు అనే కొండ ఉంది.

**6. ధర్మపురి :** రామలింగేశ్వరస్వామివారి దేవాలయం, మరియు నరసింహ స్వామివారి దేవాలయం దర్శించగలరు. కరీంనగర్‌కు 65 కి.మీ దూరం, జగిత్యాలకు 30 కి.మీ దూరములో వున్నది. ఈ సుప్రసిద్ధ నృసింహ క్షేత్రం.

**7. ఓదెల :** తెలంగాణా ప్రాంతంలోనే ప్రసిద్ధ శైవక్షేత్రాల్లో ఇది ఒకటి. ఇచ్చటగల మల్లికార్జునస్వామి ఆలయం అతిప్రాచీనమైనది. పెద్దపల్లి నుండి 20 కి.మీ. దూరంలో ఉంది.

**8. గొడిశల :** హుజారాబాద్‌కు దగ్గరలో గల గుడిశల గ్రామములో మెట్టమీద గల శివాలయమును దర్శించగలరు. (పంచలింగ దేవాలయం)

**9. జమ్మికుంట :** ఇక్కడ 7 వందల సం॥క్రితం నిర్మించిన దేవాలయాలు కలవు

**10. కొండ గట్టు :** కరీంనగర్‌కు 35 కి.మీ. దూరములో ఆంజనేయస్వామి ఆలయం తప్పక చూడదగినది. పిశాచపీడితులు మండలరోజులు వున్నచో వారికి రోగవిముక్తి కలుగును.

**11. క్రొత్త కొండ :** భీందేవరపల్లి మండలం కొత్తకొండ గ్రామంలోని వీరభద్రస్వామి దేవాలయం అతి పురాతనమైనది.

**12. ఇల్లందుకుంట :** కాజీపేట జంక్షన్ రైల్వేస్టేషన్ నుండి బలార్షార్ పోవు రైలు మార్గంలో జమ్మికుంట స్టేషన్‌కు 4 కి.మి దూరంలో ఉన్నది. జమ్మికుంట మండలంలో జమ్మికుంటకు 15 కి.మీ. దూరములో ఈ గ్రామములో సీతాలక్ష్మణ సమేత శ్రీరాముని దేవాలయము చూడదగినది. ధశరథునికి శ్రాద్ధకర్మలు ఆచరించిన ప్రదేశము.

**13. ధూళికొట్ట :** జూలవల్లి మండలం ధూళికొట్ట గ్రామంలో బౌద్ధారామ స్థూపం దర్శించగలరు.

**14. స్తంభం పల్లి :** ఇచ్చట గల సంగమేశ్వరుడి ఆలయం చూడదగినది.

**15. కోటి లింగాల :** ఇచ్చట గల కోటిలింగాల చూడదగినది.

**16. నగనూరు :** ఇచ్చట గల త్రికూటాలయం చూడదగినది.

